ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# ఆంధ్రదేశము - స్త్రీలు

రచయిత

డాక్టరు (శ్రీమతి) అల్లాడి వైదేహి




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# ముందు మాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం అసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది, రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగుజాతి చరిత్రలో, మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగుమాట్లాడు ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడే వారి తరువాత స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలలో మేళవించి, వాటిని సుసంపన్నము చేస్తున్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్థ్రిమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, ఆవిధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవని విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదిన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కో-వంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు

జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని, (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతున్నది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడం లేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్ప బడుతున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# ప రి చ య ము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధదేశాలలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒక చోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వాన సంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు; విద్యాశాఖా మంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు; ఆర్థిక మంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగు జాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్‌సంఘమును,శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వానిరచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట

కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **ఆంధ్రదేశము-స్త్రీలు** అను గ్రంథమును రచించిన డాక్టరు(శ్రీమతి)అల్లాడి వైదేహిగారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన బి. వి. ఆర్. బాల్‌రెడ్డి అండ్ కంపెని వారికి మా కృతజ్ఞత.

హైదరాబాదు
తేది 20-3-75

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి

# వి ష య సూ చి క

---

| నెం. | | పుట |
|---|---|---|

# ఉ పో ద్ఘా త ము

ఆదికాలమునుండి భారతదేశములో స్త్రీలకు సంఘములో ప్రత్యేక స్థానము ఇవ్వబడి యున్నది. పురుషులవలె కాక స్త్రీలు సామాన్య జీవితములో బాల్యమునుండి ఏ విధముగా ప్రవర్తించవలెనో, వారియొక్క కట్టుబాటులు, వారనుసరించవలసిన ధర్మసూత్రములు, ప్రతి ధర్మశాస్త్రములోనూ, ప్రతి గ్రంథములోను ఏదో ఒక విధంగా సూచింపబడియున్నవి. స్త్రీలపై సంఘము నిర్దేశించిన ఆంక్షలు పురుషుల మీద లేవు. దీనికి కారణములు అనేకములని చెపుతూ ఉంటారు.

యాజ్ఞవల్క్య స్మృతిలో స్త్రీలను గురించి ఈ విధముగా చెప్పబడి యున్నది. "ఎచ్చట స్త్రీలు గౌరవనీయులుగా ఉందురో, అచ్చట దేవతలు సంతోషముతో నుందురు. ఎచ్చట వారికి గౌరవము లేదో అచ్చట వారు చేయు దైవిక కర్మలు ఫలము నీయవు. ఏ గృహమున బంధువులు మహిళలను తగినట్టుగా సన్మానింపరో ఆ ఇల్లు వారిచ్చు శాపమునకు గురి అయి, గారడీవాని మాయవలె, ఆ గృహమే నాశనమై మాయమైపోవును. వారి వారి సంక్షేమము కొరకు పురుషులు స్త్రీలకు నగలు, బట్టలు, ఉత్సవ సమయములలో మంచి ఆహారము, విహారములు సమకూర్చవలెన''ని యాజ్ఞవల్క్యుడు చెప్పియున్నాడు. మనువు కూడా స్త్రీలను తండ్రులు, అన్నదమ్ములు, భర్తలు, వారి వారి శ్రేయస్సుకొరకు ఆభరణాదికములచే సంతోషపెట్టవలెనని చెప్పినాడు.

ఇటువంటి గొప్ప స్థానమును, బరువు, పరువులతో కూడిన బాధ్యతను స్త్రీపై విధించుటచేతనే ప్రత్యేకముగ మన స్మృతులు, గ్రంథములు స్త్రీల ప్రవర్తనను గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకొని యున్నవి. సంఘములో ఏ విధముగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణ విభాగము జరిగియున్నదో, ఏఏ వర్ణములవారు చేయవలసిన విధులు ప్రత్యేకించి చెప్పబడి యున్నవో, అట్లే, స్త్రీ పురుషుల మధ్య ఎటువంటి బాధ్యతలున్నవో తెలియపరచుచూ మన గ్రంథములు వ్రాయబడి ఉన్నవి. ఈ వర్ణములలో బ్రాహ్మణుల మీద ఎక్కువ ఆంక్షలు విధింపబడి యున్నవి. వారి దినచర్య, వారు తినవలసిన ఆహారము,

వారనుసరించు నియమములు గురించి మరే వర్ణములతో సంబంధము లేక వ్రాయబడుటకు కారణము వారు సంఘ నీతి నియమాలను కాపాడుతారని. అదే ప్రత్యేకించి స్త్రీలనుగురించి ఆంక్షలు పెట్టినప్పుడు వారు కుటుంబ గౌరవ మును కాపాడుటకు, కుటుంబ శాంతికొరకు పాటుపడుటకు ముఖ్యమైన పాత్ర వహించవలసి యున్నది. ప్రతి కాలములో కూడా ఆ కాలపు సంఘముగురించి ప్రస్తావన జరిగినపుడు స్త్రీలను గురించిన వర్ణన ప్రత్యేకముగ కనిపించుచుం డును. స్త్రీపురుష సమానత్వము గురించిన సమస్యకు ఇందుచేతనే ప్రాచీన మాధ్యమిక యుగములలో తావు లేకపోయెను. ఆధునిక యుగములో కాల పరిస్థితులనుబట్టి ఈ సమస్య తలఎత్తినా ప్రకృతి సంబంధమైనటువంటి విషయ మును మానవుడు మార్చలేడు. సంఘములో స్త్రీకి గల గౌరవ, ప్రత్యేక స్థానా నికి ఎన్నడూ ఎదురు లేదు.

---

# ఆంధ్రదేశము - స్త్రీలు

## ప్రాచీన ఆంధ్రదేశము

ప్రాచీన ఆంధ్రదేశములో మొదటిసారిగా స్త్రీలను గురించిన ప్రసక్తి మనకు శాతవాహనుల శాసనములలోను, హాలుడు వ్రాసిన గాథాసప్తశతిలోను గుణాఢ్యుని బృహత్కథ ననుసరించి వ్రాయబడిన కథాసరిత్సాగరములోను కనిపిస్తున్నది. వాటి ఆధారముతో స్త్రీలను గురించి, వారి వేషభాషలు, వివాహాది సమస్యలు, గృహిణి బాధ్యతలు, భార్యాభర్తల సంబంధములు, వారు చేయు వ్రతములు, దానధర్మములు, వారి విద్య మొదలైన అంశాలన్నీ మనకు తెలియగలవు.

## కులస్త్రీలు

ప్రాచీనకాలములో స్త్రీలలో రెండు రకాలవారు ముఖ్యముగా కనిపిస్తారు. కులస్త్రీలు, వేశ్యలు అని వారికి పేర్లు : కులస్త్రీ అనగా శాస్త్రీయముగా పెండ్లి అయిన మహిళ. పాతివ్రత్యమనగా భర్తను పరమ దైవముగా భావించుట. పాతివ్రత్యము స్త్రీకి ప్రధానధర్మము. స్త్రీలకు విహితమైనటువంటి ధర్మములో కెల్ల నిది అత్యుత్తమైనదని మన సంప్రదాయము చెప్పుచున్నది. గాథాసప్తశతిలో అనేక సందర్భములలో పతివ్రతస్త్రీలను గురించి చెప్పబడియున్నది. అట్లే శీలవతి, పతిపరాయణ, గుణవతి, నిర్మల, కులాంగన అని స్త్రీయొక్క విశేషణములు పేర్కొనబడినవి. భర్త సుఖము కోనరము అతడు పరస్త్రీలను చేరినను అతని దారికి అడ్డురాక, అతని సుఖమే తన సుఖముగా తలపోసిన స్త్రీలు మనకు ఆ రోజులలో కనిపిస్తారు. అనుకూలవతి, సౌందర్యవతి అయిన తన భార్య ఉండగా ఒక యువకుడు బహుమహిళాసక్తుడై ప్రవర్తిస్తే, అతని చరిత్ర సమగ్రముగా తెలిసినప్పటికీ, బుద్ధిమంతురాలైన వాని ఇంతి, సత్కుల ప్రసూత అగుటచేత నిండు మనస్సుతో మెలగుతూ అమిత వ్యథ గలిగినపుడు కూడా కోప రోష ఈర్ష్యాదులను వెలికి రానీయకుండా అత్యంత ఆదరముతో నడిచేది. స్త్రీకి కోపము, రోషము, ఈర్ష్య ఉండకూడదని, అటువంటి వ్యక్తే గుణవంతురాలని ఆ రోజులలో అభిప్రాయ

పడెడివారు. స్త్రీలు ఇంటిలోని మంచి చెడ్డలు, కష్ట సుఖములు ఎరిగి మెలగవలె నని గాథాస ప్తశతిలో చెప్పబడియున్నది.

ఒక పెద్ద ముత్తయిదువ ఒక కొత్త కోడలికి ఇలాలి ధర్మమును ఈ విధముగా ఉపదేశించినది. "కుల కాంతలు, అతి దరిద్రుడైనను తమ పతి యొక్క గౌరవమును, అభిజాత్యమును నిలబెట్టుకొన ప్రయత్నింతురు. కాని, ధనికులైన చుట్టపక్కాలలో వెలితి పడరు. పతివ్రతలు ధనాదులకు లోబడరు" కాబట్టి ప్రతి కులస్త్రీ ఈ విధంగా ప్రవర్తించవలెనను అర్థము స్ఫురిస్తుంది.

ఆ రోజులలో విద్య నేర్చినవారు అనేకు లుండేవారు. వారిలో అగ్ర వర్ణస్థులు బాగుగా చదువుకొన్నవారని తెలియగలదు. శాలివాహనుని పట్ట మహిషి అయిన మలయవతి సంస్కృతభాషలో అపార జ్ఞానము కలిగి ఉండి నది. ఒక రోజు ఆమె భర్త శాలివాహనుడు ఆమెతో జలక్రీడ చేయుచుండి నాడు. వారిద్దరు 'ఓల' ఆడుతూ ఒకరి మీద ఒకరు నీరు చల్లుకొంటూ ఉండగా, మలయవతి ఆ నీటి పోతకు సహింపలేక ఉక్కిరి బిక్కిరి అయి భర్తతో 'మోదకైస్తాడయ' అని చెప్పింది. నీళ్ళతో కొట్టకు అని అర్థము. శాలివాహనుడు సంస్కృతములో ప్రవేశము లేనివాడైనందున మా ఉదకైః బదులు మోదకైః అని తలచి, కుడుములు తీసుకురమ్మని పరిచారకులకు ఆజ్ఞా పించినాడు. అది విని మలయవతి పక పక నవ్వినదట. దీనిని బట్టి ఆ రోజులలో స్త్రీలు సంస్కృతములో ఎంతటి ప్రవేశము గలిగి ఉండెడి వారో తెలియగలదు. ఈ కారణము చేతనే కాబోలు శాతవాహనుల కాలములో రాజులకు తమ తల్లులనిన ఎంతో గౌరవము. వారి శాసనాలలో మనకు వారిని గురించిన ప్రశంస కనిపిస్తుంది.

నాసిక్ శాసనములో గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణియొక్క దిగ్విజయములు పేర్కొనబడి యున్నప్పుడు, అతడు సత్యశీల, దానశీల, ఓర్పు, నియమ, నిష్ఠలు గలిగి, ఋషిపత్నితో సమానమైనటువంటి తపశ్శక్తి గలిగిన రాణి బాలశ్రీ కుమారుడని చెప్పబడియున్నది. అట్లే మరొకచోట శాతవాహన చక్ర వర్తి తల్లి, మాతామహి, అనేక దానధర్మములు చేసినట్లు పేర్కొనబడినది. దీనినిబట్టి స్త్రీలకు సంఘములో ఎంతో గౌరవముండని తెలియడమే కాక, రాజు లకు తగిన సలహాలనిస్తూ వారికి అన్ని రంగాలలో సహాయపడేవారని తెలియు

చున్నది. సాతవాహన చక్రవర్తులు మాతృభక్తిపరులై తమ తల్లిపేరు ముందు చెప్పి తరవాత తమ పేరు చెప్పుకొనెడివారు. వాసిష్ఠీపుత్ర పులోమావి, గౌతమీపుత్ర శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి ఈవిధముగా వారి పేరులుండెడివి. ఇక్ష్వాకు రాజులుకూడా ఈపద్ధతిలోనే నామధేయములు ధరించిరి. ఉదాహరణకు వాసిష్ఠీపుత్ర శాంతమూలుడు, మాంధారీపుత్ర శ్రీవీర పురుషదత్తుడు అని వారి పేర్లు. ఈ రాణులు విస్తారముగా దానములు చేసెడివారని చెప్తూ నాగార్జునకొండ శాసనము వారిని 'పండిత స్త్రీలని' కూడా వర్ణిస్తున్నది.

సామాన్య స్త్రీలుకూడా ఆ రోజులలో చదువుసంధ్య లరసినవారుగా తెలియుచున్నది. దూరప్రాంతములకు పోయిన భర్త ఎంతకు రాని కారణంగా భార్య దిగులుపడి భర్తకు ఉత్తరము వ్రాసినట్లు మనకు గాథాసప్తశతిలో కనిపిస్తుంది.

అమరావతి శాసనములో అనులక్షి, మాధవి, లోహ, రేవ అను కవయిత్రుల పేర్లు పేర్కొనబడి యున్నవి. వారు ఇక్ష్వాకులనాటి వారు. ఈ విధముగా ప్రాచీన కాలములో ఆంధ్ర ప్రాంతములో కులస్త్రీలలో కూడా ఆరితేరినటువంటి, విద్యా విశారదలైన స్త్రీలున్నట్లు మనకు స్పష్టముగా తెలియ గలదు.

## వేశ్యలు

మన సాంఘిక వ్యవస్థలో ఒక ప్రత్యేకస్థానము వేశ్యలకు మొదటి నుండి ఇవ్వబడి ఉన్నది. ఆదినుండి వేదాలు, తంత్రాలు వారిని గురించి ప్రస్తావిస్తూనే ఉన్నాయి. యువతి అయినటువంటి వేశ్య శక్తిస్వరూపిణి (Sakti incarnate.)

దైవమును తలచుకొనుచూ సురతాగినా, వేశ్యతో సంబంధము కలిగినా పాపముకాదని కొన్ని తంత్రాలలో చెప్పబడియున్నది. స్త్రీలు ఎటువంటి తప్పులుచేసినా వారిని కొట్టకూడదు. నూరు తప్పులుచేసినా, పువ్వులతోనైనా కొట్టకూడదట. ఆమెలో మంచితనాన్ని గుర్తించి, లోపములను మరచిపోవాలి. ఆమె ఆదిశక్తిపంశములో పుట్టింది కాబట్టి ఆమె వేశ్యే అయినా, పాపి అయినా గౌరవింపతగ్గదని తంత్రాలు చెపుతాయి.

దీనిలో ఎంత నిజమున్నదో చెప్పజాలము కాని వేశ్యలు మనసంఘంలో మొదటినుండి ఉండేవారనీ, వారిని సమర్థిస్తూ అనేక గ్రంథములు వ్రాయబడి ఉన్నాయని తెలియగలదు.

ఆంధ్రదేశములో, శాతవాహనుల కాలములో అనేకమంది వేశ్య లుండే వారు. వారిని వేశ్యలని, వారాంగనలని చెప్పేవారు. గాథాసప్తశతినిబట్టి ఆ కాలములో వేశ్యలకు రసికజన సమాజములో సంపూర్ణముగా ప్రవేశమున్నట్లు తెలియుచున్నది. వాత్స్యాయన కామసూత్రములలో వారికి అపారమైన మర్యాద లీయబడినవి. వారు సాధారణముగా పరమ విదుషీమణులు. చతుష్షష్టి కళా నిష్ణాతలు. రాజనీతిలో ఎదురులేని పాండిత్యము కలవారు. అందువలన రాజులు వారి కపరితముగ ధనాదులు ఒసగి, పోషించుచు, రాజనీతికి సంబంధించిన కార్యములను వారి ద్వారా సాధించుకొనెడివారు. రాజ్యములు సుప్రతిష్ఠము లగుటకు, కూలిపోవుటకు కూడా అప్పుడప్పుడు వారి వైదగ్ధ్య విశేషములే కారణములని చెప్పవచ్చును. వారికి రాజసభా ప్రవేశముండెడిది. అచ్చట సంగీత, నృత్య ప్రదర్శనములు కూడా ఇచ్చెడివారు.

వేశ్యలు కామ శాస్త్రములోను, నాట్యాదులలోను నిపుణలుగా ఉండే వారని గాథాసప్తశతిలో మనకు అనేక సందర్భములలో కనిపించుచున్నది. సాధారణముగా వయస్సు మళ్లిన వేశ్యలు వేశ్య మాతలుగా తమ కూతురికి తగిన విటులను ఏర్పాటుచేసి, వారి వద్దనుండి ధనమును రాబట్టెడివారు. అమితముగా ధనమిచ్చి, సంతోషపెట్టుచున్న ఒక ధనిక యువ భుజంగునకు కామ శాస్త్ర రహస్యము నుపదేశించుటకు, నాట్యాదులలో నిపుణురాలైన తన కూతురు మీద అతనిని అత్యంతము అనురక్తుని చేయుటకు వృద్ధ వేశ్యామాత అతనితో సంప్రదించినదని గాథాసప్తశతిలో ఒకచోట చెప్పబడియున్నది. అట్లే ఎవరెక్కువ ధనమిచ్చిన అంతకు ముందునుండి ఉండిన విటులను విడనాడుట, వీలయినంతవరకు వారి దగ్గర నున్నటువంటి ధనము నంతయు రాబట్టి వారిని వెడలగొట్టుట వారాంగనలకు ఉగ్గుపాలతో పెట్టినటువంటి విద్య. అందుకే కులస్త్రీలు వారిని నీచముగా చూచెడివారు; ఛీదరించుకొనెడివారు; తమ భర్తలు వారివద్దకు పోయినందుకు భర్తలను దూషించక, భర్తలను అన్యాయముగా పేదవారిని చేసినందుకు వారాంగనలను దూషించెడివారు. అందుకే భర్త రాత్రిపూట ఇంటిపట్టున ఉండక, తన భార్య అంతటి రూపవతి కాక

పోయినను వేశ్యవద్దకు వెళ్తున్న భర్తను చూచి ఆమె మారు మాటాడక ఊరక ఉండెడిది. వేశ్యలకు అనేకమంది పురుషులతో సంబంధ మున్నప్పటికీ, దీనిని తప్పుగా ఎవ్వరు పరిగణించెడివారు కాదు. అదే, కులకాంతలు పర పురుషుల మీద ఏమాత్రము వ్యామోహము చూపినను వారు సంఘమునుండి వెలి వేయ బడిన వారుగ భావింబడెడి వారు. ఈ విధముగా వేశ్యలకు ఆ రోజులలో ఒక ప్రత్యేకమైన స్థానమున్నదని, పురుషులకు వినోదము కలిగించే ఆట వస్తువులుగ వారుండెడివారని తెలియగలదు.

## స్త్రీలు - వృత్తులు

ప్రాచీనకాలంలో స్త్రీలు అన్ని వృత్తులు చేపట్టక పోయినను, అగ్ర వర్ణ స్త్రీలు, ముఖ్యముగా క్షత్రియ కన్యలు, రాజులకు సలహాదారులుగాను, రాజులు యుక్త వయస్కులు కానప్పుడు పరిపాలనము చేయడము మనకు చరిత్రలో కనిపిస్తున్నది. గ్రామాలలో ఉండేటటువంటి వారు భర్తలతోబాటు పొలములందును, తోటలలోను, గానుగులచెంతను పని పాటలలో పాల్గొనుచుండెడి వారు. మరికొందరు పుష్పములను విడిగానో, మాలలగానో గ్రుచ్చి అమ్మేవారు. వారిని పువ్వులమ్ము పడుచులని చెప్పేవారు. మొత్తముమీద స్త్రీలు ఉదయము నుండి రాత్రివరకు తీరిక లేని పని కలిగి ఉండేవారు. వారికి గనుక ఎక్కువ విశ్రాంతి కలిగితే వారి మనస్సు అన్యథా పోవునని, వారు దారితప్పి ప్రవర్తిస్తారని, పర పురుషులమీద వారికి మోజు కలిగి, భర్తలు ఎంత గొప్పవాళ్ళయినప్పటికి, ఎంత మంచివారైనప్పటికి, ఎంత ధనవంతులైనప్పటికి వారు వారిని అలక్ష్యము చేయుదురని పురుషులు మరియు శాస్త్రజ్ఞులు భయపడి కాబోలు స్త్రీలకు విశ్రాంతి లేకుండా చేశారు.

## స్త్రీలు - వివాహము, ఇతర సంస్కారములు

వివాహమనునది పవిత్ర మైనటువంటి సంస్కారము. స్త్రీ పురుషుల నిద్దరిని కలిపేటటువంటి సంస్కారము. ఆ కాలములో బాల్య వివాహము లింకను కనిపించవు. తల్లిదండ్రులు ఏర్పాటు చేసిన వరుని వివాహమాడుట సంప్రదాయముగా ఉండెడిది. కొన్ని సందర్భాలలో గాంధర్వ వివాహ పద్ధతి కూడా అనుసరించే వారు. వివాహ సమయమందు తండ్రులు, అన్నదమ్ములు,

ఇతర పెద్దలు కన్యకు కట్నము చదివించేవారు. దీనినే స్త్రీధనమని చెవుతారు. అట్లే పెండ్లి కుమారుడు, అతని తండ్రి, కోడలిని సంతోష పెట్టుటకుగాను నగలు, నగదు ఆమెకు ఇచ్చెడివారు. ఈ విధముగా వివాహ కాలమందు స్త్రీకి సంక్రమించి నటువంటి స్త్రీధనముపై సంపూర్ణ హక్కులు ఆమెవే. భర్త ఆమెకు విడాకు లిచ్చినప్పుడు ఈ ధనమంతయు ఆమెకు తిరిగి ఇచ్చివేయుటయే గాక ఆమెకు ఆహార, వస్త్ర, గృహ లోపాలు కలుగకుండునట్లుగా అతడు ఆమెకు తగిన సౌకర్యములు కలిగించే బాధ్యత వహించవలసి యుండినది.

ఆ రోజులలో పురుషుడు ఒక స్త్రీ కన్న ఎక్కువమందిని వివాహమాడే వాడు. మనకు క్షత్రియులలో ఎక్కువగా ఈ సంప్రదాయము కనిపిస్తున్నది. యుద్ధములో గెలుపొంది నటువంటి రాజు, ఓడిపోయిన రాజు యొక్క కుమార్తెను వివాహము చేసుకోవడము, ఆ విధముగా అనేక రాజపుత్రికలను వివాహము చేసుకోవడము చరిత్రలో కనిపిస్తున్నది. ఇక సామాన్యులలో భార్యకు బిడ్డలు కనే అవకాశం లేనప్పుడు, భార్య మొగబిడ్డలను కననప్పుడు, ఆమె తీర వ్యాధులతో బాధ పడుతున్నప్పుడు, అతడు తిరిగి వివాహము చేసికొనుటకు మన శాస్త్రములు, స్మృతులు ఒప్పుకొంటున్నవి. అటువంటి సందర్భములో అతడు తన భార్యను ఇంటినుండి వెళ్లగొట్ట కూడదు. అందుకే సవతులందరు ఒకే గృహములో ఉండుట, వారి తగవులను భర్త తీర్చుట మనకు కథలలో కనిపిస్తాయి. భార్య కులట అయినప్పటికి కూడా భర్త ఆమెను ఇంటినుండి వెళ్లగొట్టక, ఆమెకు ఇంటిలో వెనుకభాగములో ఒక చిన్న పాకను ఏర్పరచి, ఆమెను కాపాడవలెనని ఆ రోజులలో అభిప్రాయ పడెడివారు. అటువంటి కులటను దేవుడే శిక్షిస్తాడు. ఆమెను భర్త శిక్షించ నవసరము లేదు. బహుశః ఇంటి గౌరవమును కాపాడుటకు, గుట్టుగా ఇటువంటి విషయములను దాచిపెట్టుటకు ఈ ఏర్పాటు జరిగి ఉండవచ్చు. మనుధర్మ శాస్త్రంలో స్త్రీ కులట అయినట్లైన, మరుజన్మలో ఆడనక్క అవుతుందని, లేక కుష్టు మొదలగు దీర్ఘ వ్యాధులు సోకుతాయని చెప్పబడి యున్నది.

స్త్రీ పతివ్రత అయితే ఆ పాతివ్రత్య మాహాత్మ్యంతో స్వర్గలోకం సంపాదించుకో గలగడమే కాక, భర్త దుర్మార్గుడయినా, ఎటువంటివాడయినా ఆమె

తన శక్తితో అతనిని స్వర్గలోకమునకు తీసుకెళ్ళగలదని స్మృతులలో చెప్ప బడియున్నది. పాములవాడు ఏ విధంగా అయితే తన నాగస్వరం బూరగతో ఎక్కడెక్కడ ఉన్న పాములను తన దగ్గరకు లాగుకుంటాడో అట్లే పతివ్రత యైన స్త్రీ తన పతి ప్రాణములను కొనిపోవడానికి వచ్చిన దూతలు అతనిని నరకమునకు తీసుకు పోనివ్వకుండా తనతో స్వర్గలోకమునకు తీసుకెళ్తుందని మనువు చెప్పియున్నాడు. ఈ విధముగా భార్యా భర్తల ధర్మాన్ని, బాధ్యతను, శీలమును, భర్తలకు కాక, భార్యకు ఆపాదించడం వల్ల స్త్రీలకు సంఘములో ఎంత గౌరవమున్నదీ తెలియడమే కాక, స్త్రీ సంఘ గౌరవమును కాపాడగల దని పూర్వులు నమ్మేడివారని తెలుస్తున్నది. కుటుంబ, దేశ గౌరవానికి స్త్రీయే కారకురాలని, ఆమెపై శాస్త్రములు ఇటువంటి ఆంక్షలు విధించేవని తెలియగలదు.

శాతవాహనుల కాలమునాటికి స్త్రీ చేయదగినటువంటి సంస్కారము లలో మార్పులు వచ్చినవి. అంతకు పూర్వము అనగా వేదకాలములో పురుష నితో బాటు అతని భార్య యజ్ఞ యాగాదులు చేయడానికి, ఉపనయనము మొద లయిన సంస్కారములను పొందడానికి, వైదిక మంత్రములను ఉచ్చరించుటకు హక్కు కలిగి యుండెడిది. క్రమేపి ఆమె ఆ హక్కులను కోల్పోయినది. వేదాలు చదవడానికి ఆమె అనర్హురాలని సంఘం నిర్దేశించింది. ఆమె భర్త పక్కన ఉండి, మూగగా అతను చేయు విధులను గమనించడం, ఆచమనం చేయుట, అగ్నిహోత్రములో నెయ్యిని వేయుట మించి మరేమి ఆమె చేయుటకు వీలు లేకపోయినది. వేదములు చదవడానికి అనర్హురాలయిన స్త్రీల కోసరం, అనర్హురాలయిన వర్ణాల వారి కోసరము ఇతిహాసములు వ్రాయబడినవని స్మృతులు చెప్పుచున్నవి. అలాగని గృహిణిగా ఆమెను అగౌరవ పరచ కూడదు. భర్త ఆమెను చిన్నచూపు చూడకూడదు. ఆమెకు ఇష్టమైనటువంటి దుస్తులను, ఆభరణములను, ముఖ్యముగా పండుగలప్పుడు ఆమెకిచ్చి సంతోష పెట్టవలెను. అట్లే తండ్రులు, అన్నదమ్ములు ఆడబడుచులను తమ శక్త్యను సారము సంతోషపెట్టినట్లైన తమ కుటుంబమునకు ఇహ పరములలో శాంతు లుంటాయని నమ్మేవారు.

కాని చదువుకున్నటువంటి అగ్ర వర్ణపు స్త్రీలు ఇటువంటి పరిస్థితులను అంగీకరించలేదు. సంఘంలో పురుషులకన్న హీనంగా ఉండుట వారికి నచ్చ

లేదు. ఆ కాలములో అనగా శాతవాహనుల కాలమునాటికి బౌద్ధమతము ప్రచారంలో ఉండి, అనేకమంది ఆ మతములో చేరినారు. బౌద్ధమతములో స్త్రీ, పురుష భేదము, వర్ణభేదము కనిపించదు. బౌద్ధులందరు సమానులే. అందుకే వారు ధర్మములు ఎక్కువగా బౌద్ధ విహారాలకు, సంఘాలకు చేసెడివారు. శాతవాహనుల, ఇక్ష్వాకుల రాణులయిన గౌతమి బాలశ్రీ, శాంతిశ్రీ మొదలయిన వారు బౌద్ధ విహారాలకు అనేక దానధర్మములు చేయుటయే గాక, అచ్చట జరుగు ప్రసంగములలో ముఖ్య పాత్ర వహించెడి వారని శాసనాలవల్ల మనకు తెలియుచున్నది.

ఈ యంశములన్నియు భారతీయ స్త్రీలకు సాధారణమైనవి. ఆంధ్ర స్త్రీలను గూర్చి ప్రత్యేకముగా ఏమియు లేదు. ఆ చారిత్రయుగంలోని ఈ క్రింది ప్రముఖ స్త్రీల పేరులు శాసనములలో కనబడుతున్నవి.

1. గౌతమీపుత్రుని రాణి.
2. దేవి నాగనిక (సాతవాహనుని రాణి)
3. గౌతమీ బాలశ్రీ
4. బోధిశ్రీ-ఇక్ష్వాకుల కాలము నాటి ఆమె *

పై విషయములవల్ల ప్రాచీన కాలములో ఆంధ్రదేశమున స్త్రీలు సంఘములో గౌరవప్రద మైనటువంటి స్థానమును పొందియుండిరనుట సుస్పష్టమగుచున్నది.

## స్త్రీలు - వేషాలంకరణములు

ఆ కాలములో స్త్రీలు చీరలను ధరించెడివారని తెలియుచున్నది. అనేక సందర్భములలో కోక, పైటలను గురించి ప్రసక్తి వచ్చినందువల్ల మనము ఈ విధముగ ఊహించవచ్చు. నల్ల రవిక, ఎఱ్ఱ రవిక, జలతారు అంచు రైక, నీలి కోక, పసిడి జలతారు అంచు చీరలు ఆ రోజులలో ధరించేవారని గాథా సప్తశతిలో తెలియుచున్నది. నూలు వస్త్రములు, పట్టు వస్త్రములు కూడా సామాన్యులు, అందరు వాడుతూ ఉండేవారు. కమ్మలు, కంఠసరాలు, మొల

* సాతవాహన యుగమున ఈ క్రింది వారును శాసనముల ద్వారా పేరు గనిరి - 1. రాణి వాసిష్ఠీ దేవి: పులోమావితల్లి 2. శాంతిశ్రీ.

వడ్డాణములు, బంగారు మొలనూలు, కడియాలు, గజ్జెలు, గాజులు ధరించే వారు. వీటిని బంగారుతోగాని, వెండితోగాని, ఇతర లోహములతోగాని చేసెడి వారు. ఎరుపు కెంపులు, పచ్చలతో పొదిగినటువంటి నగలు కూడా ఆ రోజులలో ఉండినట్లు కనిపించుచున్నవి.

తలుపులకు పరదాలు వేసే అలవాటుండెడిది. పట్టు పరదాల ప్రసక్తి గాథా సప్తశతిలో కనిపిస్తుంది. పండుగలు పబ్బాలు జరిగినప్పుడు గృహములను చక్కగ అలంకరించెడివారు. రంగులతో ముగ్గులు పెట్టెడివారు. బూరెలు, పరమాన్నము మొదలైన తీపి వంటకాలు చేసి తినెడివారు. పల్లెటూరి పడుచులు ఒక విధముగాను, పట్టణవాసులు మరొక విధముగాను రకరకమైన దుస్తులు ధరించి హోళీ పండుగ ఉత్సవము జరుపుకొనుచూ, ఒకరిపై ఒకరు రంగులు విసురుకొనుచు, పాటలు పాడుచు, ఆటలు ఆడుతూ ఉండేవారట. దీనినిబట్టి స్త్రీలు పూర్తిగా వెనుకబడినవారుగా గాక, అన్ని రంగాలలో పురుషులతో బాటు ప్రవేశం కలిగి ఉండేవారని చెప్పవచ్చును.

ఆ కాలపు ఆచారములను గురించి చెప్పినప్పుడు సహగమనమును గురించి తప్పక ప్రస్తావించవలెను. భర్త మరణించగనే భార్య కూడా అతని శవముతోబాటు చితి మీద పరుండి దగ్ధమయ్యే అలవాటునకు సహగమనమని పేరు. ఇది మన దేశములో ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నటువంటి అలవాటు. విదేశాలలో కూడా అక్కడక్కడ ఈ అలవాటు కనిపించేది. కాని నాగరికత వృద్ధిగాంచుటతో అచ్చట ఈ ఆచారము మాయమయినది. కాని భారతదేశములో నాగరికత వృద్ధి చెందుటతో సహగమనము కూడా క్రమ క్రమముగా తీవ్రము కాసాగినది. ఈ ఆచారము ఎక్కువగా అగ్ర వర్ణముల వారిలో కనిపించుచున్నది. మిగతా వర్ణములవారిలో ఇది కనిపించకపోవడానికి వారిలోని వితంతు పునర్వివాహాచారమే కారణము. ప్రాచీన కాలములో మన ఆంధ్ర దేశములో సహగమనము అగ్ర వర్ణములలో కూడా కొన్ని కుటుంబాలకే పరిమితి అయి ఉండేది. గాథా సప్త శతిలో సహగమనము గురించిన ప్రసక్తి ఒకటి రెండు చోట్ల ఉన్నా మొత్తము మీద ఈ అలవాటు ఆ రోజులలో ఎక్కువగా ఉన్నట్లు కనిపించదు.

## మాధ్యమిక యుగమునాటి స్త్రీల పరిస్థితి

సాహిత్య గ్రంథములనుబట్టి, శాసనములబట్టి మనకు ఈ కాలములో స్త్రీలలో మూడు వర్గములవారు కనిపించుచున్నారు. కులస్త్రీలు, భోగస్త్రీలు, వేశ్యలు అని ఆ మూడు వర్గములకు పేర్లు. ప్రాచీన కాలములో కులస్త్రీలు, వేశ్యలు మాత్రము ఉండినట్లు తెలుసుకొన్నాము. ఈ యుగములో భోగస్త్రీలు కూడా ఉన్నారు. సంఘములో మొదటి వర్గమువారు అధిక సంఖ్యలోను, తతిమావారు అల్ప సంఖ్యలోను ఉండేవారు.

### కులస్త్రీలు

కులస్త్రీ శాస్త్రోక్తముగ వివాహమయిన మహిళ యని, భర్తను పరమ దైవముగా నెంచుట ఈమె ప్రధాన ధర్మమని, కులస్త్రీలు పతివ్రతలుగా ఉండవలెనని మనము ఇదివరకే తెలుసుకొన్నాము. ఈ యుగములో కూడా ఆంధ్ర దేశ చరిత్ర పరిశీలించినట్లయిన పతివ్రతలగు స్త్రీలకు సంఘములో ఎంతో గౌరవ స్థానమున్నదని, శాసనములలో సాహిత్య గ్రంధములలో స్త్రీలను గురించిన ప్రసక్తి వచ్చినప్పుడు ఆమె పతివ్రత అనియో, భర్తృ సేవాపరాయణురాలనియో, పతిహిత చరితురాలనో పేర్కొనబడెడిదని తెలియుచున్నది.

కులస్త్రీకి భర్తకు సేవ చేయుట మాత్రమే ధర్మము కాదు, ఆమె గృహ నిర్వహణ భారమంతయు మోయవలసి యుండెను. ఆమె గృహ పత్ని. ఇంటియందు ఆమెకు నిద్ర లేచినది మొదలు తిరిగి పడక చేరువరకు విరామములేని దినచర్య ఉండెడిది. ఉదయమే నిద్ర లేచిన వెంటనే వాకిలి శుభ్రము చేసి, కలియాపు చల్లి, ముగ్గులతో అలంకరించవలెను. అటు పిమ్మట పాత్రలు శుద్ధిచేసి, పూజా గృహమునకు వలయు వస్తువులనుంచి, వంట చేసి, పిల్లలకు, పెద్దలకు భోజనాదికములు నిర్వర్తించుట ఆమె నిత్య జీవితము సాధారణముగా పెద్దలుచేయు పనిని పిల్లలు అనుకరిస్తూ ఉంటారు. ఆ దృష్టితోనే నన్నెచోడుడు తన కుమారసంభవములో పార్వతి బాల్యదశను ఈ విధముగా వర్ణించినాడు. పార్వతి మట్టితో, కఱ్ఱతో, దంతముతో బొమ్మలనుచేసి, బొమ్మరిళ్ళు కట్టి, బొమ్మ పెండ్లిండ్లు చేసెడిది. గుజ్జన గూళ్ళు వండెడిది. శివార్చన చేసెడిది. దీనినిబట్టి గృహిణులకు దేవతాపూజ నియతముగా నుండెడిదనియు, మట్టితో, కఱ్ఱతో, దంతముతో వారి వారి స్తోమతనుబట్టి విరామ కాలమున

గృహమున కవసరమైన చిన్న చిన్న వస్తువులను స్వయముగ చేసికొనెడి వారసియు, వారి దైనందిన జీవితమును గురించి చూచాయగా తెలియుచున్నది.

ఆ రోజులలో ఇల్లాండ్రైన స్త్రీలు పురుషులు లేకుండా, ఒంటరిగా బయటకు వచ్చేవారు కారు. భర్త కాని, దగ్గర బంధువులైన పురుషులు గాని వారికి సహాయముగా వచ్చెడివారు. వీరశైవమతము ఆ రోజులలో సంఘములో విప్లవము లేవదీసినది. ఆ మత ప్రచారకులు స్త్రీ పురుషులకు సమాన హక్కులను ప్రతిపాదించినారు. అంతే కాదు, పురుషునికి ఎదురు చెప్పే అధికారము కూడా కొన్ని సందర్భములలో వీరశైవము స్త్రీల కిచ్చినది. భర్త శివభక్తుడు కానట్లయిన భార్య అతనికి మొదట శివభక్తిని నేర్పవలెను. అట్లాతడు వినని పక్షమున అతనిని విడిచిపెట్టవలెనని శివతత్వసారములో చెప్పబడియున్నది.

ఆనాటి సాహిత్య గ్రంథములు చదివినట్లయిన, స్త్రీలకు సంఘములో ఎంతో గౌరవస్థానమున్నట్లు విశదమౌతున్నది. నన్నయ్య భారతము ప్రారంభించుచూ త్రిమూర్తి స్తుతిలో 'శ్రీ వాణీ గిరి జాశ్చిరాయ' అని స్త్రీ దేవతలనే ముందు పేర్కొన్నాడు. నన్నెచోడుడు తన తల్లిని హైహయాన్వయాంబర శశిరేఖయైన గుణభాసిని, శ్రీ సతికి తనూజుడనని చెప్పియున్నాడు శాసనములలో తల్లి పేరు చెప్పబడుటచేత ఆమెకు గల గౌరవస్థానము తెలియుచున్నది.

## సాని

శాసనములలో స్త్రీలను పేర్కొన్నప్పుడు తరచు 'సాని' అనే పదమును వాడెడివారు. ఇచ్చట సానిని గురించి కొంచెము ప్రస్తావించుట అవసరము. ప్రస్తుత కాలములో 'సాని' పదము నీచార్థములో నుపయోగింపబడుచున్నది. కాని మాధ్యమిక యుగములో అట్లు కాదు. ఏ కులస్థులైన ఉత్తమశ్రేణికి చెందినవారై, సంఘములో గౌరవనీయులైనట్లయిన, ఆ స్త్రీలను సాని అనే పేరుతో పిలిచెడివారు. గోకసాని, కాపుసాని, సూరసాని ఈ విధముగా వారిని సంబోధించెడివారు. సామంతులయొక్క, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రుల యొక్క తల్లులను సాను లనియే పిలిచెడివారని శాసనములు సాక్ష్య మిచ్చుచున్నవి.

ఆ రోజులలో ఏ పనిచేసినా తల్లి ఆశీస్సులను ముఖ్యముగా ఆశించెడివారు. బాలచంద్రుడు యుద్ధమునకు వెళ్లుటకు ముందు తల్లి ఆశీస్సులను పొంది

నాడని పల్నాటి యుద్ధములో చెప్పబడియున్నది. అతనితోబాటు అతని అను చరులుకూడా వారి వారి తల్లుల ఆశీస్సులను పొందినారు. తల్లులుకూడా అందుకు తగినట్టుగా తమ బిడ్డలు తమ వంశమునకు పేరు ప్రతిష్ఠలు తేవలె నని, అటువంటి సందర్భములో బిడ్డల ప్రాణముపోయినను తల్లులు గొప్పగా చెప్పుకొనెడివారు కాని, దుఃఖించెడివారుకారని చెప్పెడివారు. వీరమాతలు కావలననెడిది వారికోరిక. పురుషులు ఎల్లవేళల బయట తిరుగుచూ తమ కార్య కలాపములతో కాలము వెళ్లబుచ్చుటచేత, బిడ్డలను తీర్చిదిద్దెడి బాధ్యత తల్లు లపైబడెడిది. తల్లులు వీరగాథలు, పుణ్యగాథలు వారికి చెప్పి, వారికి తెలిసిన విద్యలనన్నింటిని బిడ్డలకు నేర్పి, తెలియనివి గురువులచేత చెప్పించి వారిని వారి వారి వృత్తుల కనుగుణముగా తర్ఫీదు చేయించెడివారు. తప్పులుచేసిన శిక్షించి, మంచికార్యములను చేసినవారిని మెచ్చుకొని లాలించేవారు తల్లులు. ఈ విధముగ తండ్రులకు బదులుగా తల్లులు బిడ్డలను ఎక్కువగా చేరతీయ డముచేత తల్లి బిడ్డల మధ్య అవ్యాజమైన ప్రేమయుండెడిది. బిడ్డలకు తల్లుల మీద ఎక్కువ గౌరవముండుటకు ఇది ఒక కారణము. ఈ కారణముచేతనే తండ్రులు, భర్తలు స్త్రీలకు ధనాదులను వాడుకొనుటలో ఎక్కువ స్వతంత్ర మిచ్చెడివారు. పురుషులపై స్త్రీలు సర్వవిధములా ఆధారపడినట్లు చెప్పినా వారికెప్పుడు బానిసలుగా ఉండలేదని అనేక విషయములలో సర్వస్వతంత్ర ముండెడిదని తెలియగలదు.

ఇటువంటి స్వతంత్రము స్త్రీలకు దైవకార్యములలోను, దానధర్మములు చేయుటలోను కనిపిస్తున్నది. శాసనాలు దీనికి ఋజువు. ఆరోజులలో స్త్రీలు చేసిన దానములు అనేకములు. వివిధ తరగతులకు, వర్ణములకుచెందిన స్త్రీలు బ్రాహ్మణులకు, దేవాలయములకు, సత్రములకు, చెరువులు త్రవ్వించుటకు, బాటలు, మార్గములు వేయించుటకు అనేక దానధర్మములు చేసెడివారు. ఈ దానములు ధనరూపములోను, భూమిరూపములోను ఉండేవి. కొన్ని సందర్భ ములలో గోజీయలనిచ్చెడివారు. వారి వారి శక్త్యానుసారము ధర్మము చేసెడి వారు. దీనినిబట్టి పురుషులకు సంబంధించిన అన్ని రకాల ఆస్తిని తమకు కావల సిన విధముగా ఖర్చుపెట్టుటకు స్త్రీలు హక్కు కలిగి ఉండేవారు. ఈ దానములలో క్రీ. శ. 1208 లో పిల్లలమఱ్ఱి జేతిరెడ్డి భార్య ఎఱుక సానమ్మ చేసిన దానము చాలా ఘనమయినది. ఆమె పిల్లలమఱ్ఱిలోని ఎఱుకేశ్వరదేవుని విగ్రహానికి

సంప్రోక్షణ చేయించి, ఆ దేవుని ఎఱుకసముద్ర మనునొకగ్రామమును ఎఱక మఠమను నొకమఠము, ఒక సత్రమును సమర్పించినది. వీనిని సక్రమముగా నడపుటకు పెద్దపల్లవు భూమినిచ్చినది. సత్రములో బాటసారులకు వేసవిలో మజ్జిగనీళ్లు ఇచ్చుటకు ఒక చలివేంద్రకూడా ఏర్పాటుచేసినది.

ఆ కాలములో పురుషులుచేసిన దానములు వివరించు శాసనములకన్నా స్త్రీలు దానములు చేసినప్పుడు వేయించిన శాసనములలో విశేషమున్నది. పురుషులు వేయించిన శాసనములు వచనములో ఉండగా స్త్రీలు వేయించిన శాసనములు చాలాభాగములు పద్యములలో ఉన్నవి. ఈ విధముగా కులస్త్రీలు మాధ్యమిక యుగములో అనేకదానములుచేసి, గౌరవముగ బ్రతికెడివారు.*

## భోగ స్త్రీలు

కులస్త్రీలకు భిన్నముగా ఆరోజులలో భోగస్త్రీలను వారు ఉండెడివారు. వారికికూడా సంఘములో గౌరవస్థానముండెడిది. వారు రాజులవద్ద, సామంతులవద్ద, దేవాలయసేవయందు జీవితమును గడిపెడివారు. ప్రాచీనకాలములో గ్రీకుదేశమందు ఇట్టి స్త్రీలుండెడివారు వారిని. 'హెటైరా'లనెడివారు. ఈ భోగస్త్రీలకు వివాహసంబంధము లేదు. కాని వారు కులస్త్రీలవలెనే ఒకే ఒక పురుషుని నమ్ముకుని ఆ పురుషుడు మరణించగానే విధవలుగా ఉండిపోయేవారు కాని తిరిగి ఇంకో పురుషునితో సంబంధము పెట్టుకొనెడివారు కాదు. అట్టివారిని లంజపెండ్లమనికూడా చెప్పెడివారు.

---

* మాధ్యమిక యుగమున పైన పేర్కొనబడినవారు గాక శాసనముల ద్వారా ఈ క్రింది వారును పేరు గనిరి.

1. సిరియాలదేవి - అనుమకొండ మాధవ వర్మ తల్లి
2. రాణి వసంతి పోతి - ఉత్తమాదిత్యుని తల్లి
3. అయ్యమహాదేవి - కుబ్జ విష్ణు వర్ధనునిరాణి
4. శీలమహాదేవి - గుణగ విజయాదిత్యుని తల్లి
5. విరియాల కామసాని - కాకతీయరాజ్యమును నిలిపిన ధీశాలిని
6. నతవాటి మైలమ, కుందవాంబ - వీరు గణపతిదేవుని సోదరీమణులు
7. ఉదయాంబ - కాకతి రుద్రమదేవి అత్త

ఇంకను పలువురు భక్తురాండ్రను పాల్కురికి సోమనాథుడు పేర్కొనెను.

భోగ స్త్రీ అనుపదముకూడా, సాని పదములాగానే ఈరోజులలో నీచార్థము స్ఫురింపచేసినా, ఆ రోజులలో హీనార్థమునందు ప్రయుక్తముకాలేదు. వారు సంగీతము, నృత్యము మొదలైన లలితకళలయందు మిక్కిలి ప్రవీణలై, పాటకత్తెలుగాను నాట్యకత్తెలుగాను దేవాలయములలో రాజాస్థానములలో నియమితులయ్యేడివారు. తమ కళాప్రావీణ్యముచేత సంఘములో ఉన్నతస్థాయిని పొంది, శాస్త్రీయపద్ధతిలో వివాహమైన రాణులతో సమానత్వము వారు గడించిరి.

## సానులు - మానులు

మధ్యయుగములో అనేక శాసనములలో సానులు - మానులు అనే పదము కనిపిస్తున్నది. ఇచట సానులు అనగా దేవాలయమున సేవకై నియుక్తులైన స్త్రీలు అని అర్థము. మానులు అనగా బ్రహ్మచారులు; దేవాలయసేవకై నియోగింపబడిన పురుషులు. దేవాలయసేవకు ఇరువురు అవశ్యకమగుటచేత ఈ పదము ఎప్పుడు జంటగ ఉపయుక్తములగును.

ఈ సానులకే దేవదాసీలను నది పర్యాయపదము. వీరు సంగీత నాట్యకళలలో నిష్ణాతలై దేవాలయమునకు తమ జీవితము సంకితము చేయుదురు. వారు అవివాహితులుగానే ఉందురు. కాని ఒక్కొక్కప్పుడు వారు పెండ్లి చేసుకొందురు. అటువంటప్పుడు వారు దేవదాసీత్వము కోలుపోవుదురు. దేవదాసీల మీద నమ్మకముతోచే దానకర్తలు కొంతమంది దేవాలయములకు దానములు చేస్తూ ఈ దానములను రక్షించుటకు సానులు-మానులను నియోగించెడివారు. మరికొంతమంది వారి జరుగుబాటుకొరకు దేవాలయములు కట్టించినప్పుడే దేవాలయసేవకై నియుక్తులైన సానులకు, మానులకు భూములనిచ్చెడివారు.

ఈ దేవాలయమునకు కైంకర్యమైనటువంటి దేవదాసీలకు చిన్నతనము నుండి సంగీత, నృత్యనాట్యాది లలితకళలయందు శిక్షనిచ్చుటకు, సంస్కృత, మాతృభాషలను అర్థముచేసుకొని వాటి ప్రకారము అభినయము చేయుటకు ప్రత్యేకముగా ఒక నాట్యోపాధ్యాయుడు నియమితుడయ్యేడివాడు.

దేవదాసిగా తయారుచేయబడిన బాలికయొక్క శిక్షణ ఈ విధముగా నుండెడిది. ఆమెకు ఐదవ సంవత్సరమురాగానే మనలో అక్షరాభ్యాసము చేసినట్లుగా ఆమెకు మంచిరోజు చూచి సంప్రదాయసిద్ధముగా శాస్త్రీయపద్ధతిలో

శిక్షణ ప్రారంభమగును. ఆ రోజు సూర్యోదయమునకు పూర్వమే ఆమెకు అభ్యంగనము చేయించి, నూతనవస్త్రములను ధరింపచేయుదురు. అటుపిమ్మట ఆమె గురువైన నాట్యాచార్యుడు కలశము ప్రతిష్ఠచేసి, విఘ్నేశ్వరుని, గౌరీ దేవిని, గజ్జెలను, తాళములను, నాట్యపీఠమును, చిరుతలను పూజచేయును. పూజ అయిన పిదప నాట్యోపదేశమునకు బాలికను కొనివత్తురు. ఆమెకు ఆనాటినుండియు నాట్యముతోబాటు సంస్కృతము, మాతృభాష, గాత్ర సంగీతములందుకూడ శిక్షణ ఇవ్వబడును. ఆమెకు పదునాలుగు సంవత్సరములు వయసువచ్చువరకు ఆమె విద్యాభ్యాసము ముగియును. ఆమె యుక్తవయస్కురాలుకాగానే ఆలయములో ఆమెకు ముద్రసంస్కారము జరుగును. అనగా ఆలయములో ఆమెకు ఒక పరీక్ష జరుగును. అందులో ఆమె నెగ్గినట్లైన ఆమె ఆలయములో దేవదాసిగా నియమింపబడును. ఆనాటినుండి ఆమె నిజముగా దేవునికి దాసియై, దేవుని తన స్వామిగా స్వీకరించి, స్వామిసేవలోనే తన జీవితమంతయు గడుపును. ఈ విధముగా ఆమె దేవదాసి అను సార్థకనామము పొందును. అట్లాకాక ఆమె ఆలయపరీక్షలో నెగ్గనెట్లైన, ఆమె ఆనాటినుండి సంఘములో గౌరవము కోల్పోవును. ఎంతటి పండితురాలైనా ఆమె సామాన్య వేశ్య జీవితము గడుపవలసి ఉండును.

దేవదాసీలు తమ కళానైపుణ్యముతో తమ గురువులకేకాక, దేవాలయములకు, రాజులకు, దేశమునకు కీర్తి తెచ్చెడివారు. ఈ దేవదాసీలు నారాయణాంశముకలవారని ఒక నమ్మకము. అందుచేతనే వారికి ఆలయములందు స్వామిపూజలో పాల్గొనుటకును, ఛత్రమును పట్టుకొనుటకును చామరములు వీయుటకును కుంభహారతి పట్టుటకును నృత్యగానాదులతో ఆరాధించుటకును హక్కు ఉందని, పూర్వీకులు వారిని ఆ పనులకుకూడా నియోగించెడివారు.

## వేశ్యలు

మాధ్యమిక యుగములో, ప్రాచీనకాలములోవలెనే, స్త్రీలలో ప్రత్యేక జాతివారుండెడివారు. వారు దేవాలయసేవకుగాక, ప్రత్యేకముగా సంగీతనాట్యాది లలితకళలయందు ప్రవీణలై ధనికుల ప్రాపున జీవించెడివారు. రూపముచేత వారు జీవించెడివారు. కావున వారికి రూపాజీవలనికూడా పేరు.

వేశ్యలు ధనమే ప్రధానముగాగల వారగుటచేత, పురుషుల నెన్ని మాయోపాయములచే వంచింపవలెనో అన్నింటిచేత వంచించి వారిని వశపరచుకొనేవారు. మందులు, మాకులుపెట్టి పురుషులను తమ వలలో వేసికొనుటకు ఎంతమాత్రము వారు వెనుదీయువారుకారు. గృహస్థులను, సంసారులను వీరాకాంక్షించి, వారివలన మిక్కిలిగా ధనమును గ్రహించెడివారు. వేశ్యలకువశులై, వారికి దాసులై, వారు కోరినంతయు, ఇండ్లు, భూములు తుదకు భార్య మెడలోని మంగళసూత్రములను అమ్మి తమ సర్వస్వము వారి కర్పించేవారు; దాని వలన కొన్ని కుటుంబములు నాశనమగుటకూడా తటస్థించుచుండెడిది. సంఘములో ఈవేశ్యలనుంచుకొనుట ఒక ఆచారముగా పరిగణింపబడుటచేత వేశ్యలకిట్టి ప్రాధాన్యము కలిగినది.

ఇట్టి వేశ్యలు ఒకరీతిగా సంఘ మర్యాదలకు దూరమైనప్పటికి, వారు సంగీత నృత్యకళలలో ఆరితేరినవారగుటచేత సంఘములో ఆవశ్యకమైన వర్గముగా పరిగణింపబడినారు. ఈ కారణముచేతనే వేశ్యలను సాహిత్యములో పేర్కొనియున్నారు. కాని, ఈ సాహిత్యములో వారి కళాజీవితముకన్న వృత్తి జీవితమే వర్ణితమైనది. ఆకాలమునాటి నన్నెచోడుని కుమారసంభవమున, పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమున, పల్నాటివీరచరిత్రమున, ఇంకా తదితర గ్రంథములలో వేశ్యలను గురించి విశేషముగా చెప్పబడియున్నది. నన్నెచోడుడు వేశ్య, వెలయాలు, (వెలకుకొనబడుస్త్రీ), లంజ, జారకామి అని పేర్లు పేర్కొన్నాడు. జాలరి వలవేయగ, ఆ వలలో పడు చేపలరీతిగా, వేశ్యలు పురుషులపై వలపన్ని వారిని లోబరచుకొందురని ఆయన చెప్పినాడు. పండితారాధ్యచరిత్ర 'పురాతన ప్రకరణములో' సోమనాథుడు వేశ్యలప్రవర్తనను వివరించి చెప్పియున్నాడు. వారి స్వభావమునుగూర్చిన విశేషములు ఏబదికిపైనవాడియున్నాడు. మచ్చుకు ఒకటిరెండు ఏమన; ఎడపరులు, కత్తిగొంట్లు, మందులమార్లు మొదలైనవి.

వేశ్యలు పట్టణములలో ప్రత్యేకముగా ఒక భాగములో నివసించెడివారు. ఈ విధముగా నగరమున వేశ్యలు ప్రత్యేకముగా ఒక భాగములో నివసింపవలెనను సంప్రదాయము కౌటిల్యుని కాలమునుండి వచ్చుచున్నది. వేశ్యలు నివసించునట్టి ప్రత్యేక స్థలములకు వేశ్య వాటికలని పేరు. వాటిని వేశ్య వాడ

లని, లంజవాటికలని, సాని వాడలని కూడా పేర్కొనినట్లు మనకు సాహిత్యములో కనిపిస్తున్నది.

శాసనములలో, సాహిత్యములోను వేశ్యల సౌందర్యము, నైపుణ్యము వర్ణితములైయున్నవి. వారు అప్సరసలవలె ఉండువారని, నృత్య, గీతములలో మంచి ప్రావీణ్యము సంపాదించినవారని తెలియుచున్నది. ఉదాహరణకు వేంగిని పాలించిన తూర్పు చాళుక్యభీముని శాసనములో 'దుండిక' అను వేశ్య పేర్కొనబడినది. ఆమె రూపములో అప్సరస. ఆమెకు మల్లపుడను కొడుకు ఉండెడివాడు. అతడు తుంబురుని బోలిన గాన విశారదుడు. అతనికి చల్లవ అను కూతురుండెడిది. ఆమె గాంధర్వ విద్య (నృత్య, గీతములు) యందు చాలా ప్రావీణ్యము సంపాదించినది. అందుచేత ఆమెకు సమస్త గాంధర్వ విద్యా విశారద అను బిరుదు ఇవ్వబడినది.

## స్త్రీలు - వృత్తులు

అగ్రవర్ణముల స్త్రీలు పూర్తిగా గృహిణిలుగా ఇంటి పనులు చేయుచు కాలము గడపెడివారు. ఏ ప్రత్యేక వృత్తిని చేపట్టెడివారు కారు. కాని గ్రామములో ఉండే ఇతర వర్ణముల స్త్రీలు వారి వారి కులధర్మముల ననుసరించి, కుల వృత్తులను చేపట్టి, తమ నిత్య జీవితమును గడపెడివారు. చాపలు, బుట్టలు అల్లు మేదర స్త్రీ లుండెడివారు. అల్లుటయందే గాక, వెదురును చీల్చుట, ఈనెలు తీయుట, అల్లుటకు సరిగా వానిని నునుపు చేయుట మొదలయిన పనులలో వారు నేర్పరులై ఉండెడివారు. వారు నగరములలో పల్లెలలో ప్రత్యేక భాగములలో ఉండేవారు. వీరుండే భాగమునకు మేదరవాడ అని పేరు.

పూలదండలను గుచ్చి అమ్ముట ఆకాలమున స్త్రీల వృత్తులలో నొకటి. వారినే పుష్ప లావికలు లేక మాలాకారులని చెప్పెడివారు. వారు నియతముగా పువ్వులను, మాలలను అంగళ్ళలో అమ్మి జీవించేవారు.

తెలికజాతికి చెందిన స్త్రీలు గానుగాడి నూనె తీసెడివారు. సంపంగి పువ్వులనుండి, ఇతర వాసన, సుగంధ పుష్పములనుండి నూనె తయారుచేసెడివారు. ముఖ్యముగా వారి సంపంగినూనెకు చాలా గిరాకీ ఉండెడిది.

కొంతమంది స్త్రీలు పూటకూళ్ళ యిళ్ళను పెట్టుకొని, నగరమునకు వచ్చెడి పర ప్రాంతీయులకు ధనము తీసుకొని భోజనము పెట్టుచుండెడివారు.

ఇట్టివారిని 'అక్కలు' అనెడివారు. వీరుండు వాడలకు అక్కల వాడలని పేరు. ఈ ఇండ్లలో ఒక రూకకు (ఆ రోజులలో చెలామణి అగుచుండెడి నాణెము) కప్పురభోగాల బియ్యముతో వండిన అన్నము, గోధుమపిండి సొజ్జి, పంచదార అప్పుడే కాచిన ఆవునెయ్యి, పెసరపప్పు, అరటిపండ్లు, నాలుగయిదు పచ్చళ్ళు గల ఆహారము లభించెడిదట.

పూటకూళ్ల స్త్రీలుకాక, పెరుగు, మజ్జిగ అమ్ము స్త్రీలు మంచినీళ్లు పోయు స్త్రీలు ఉండేవారు. వంటలక్కలుండెడివారు. దేవాలయములలో బియ్యము దంపుట, ఎంగిళ్లు ఎత్తుట మొదలైన వృత్తులుకూడా స్త్రీలు చేపట్టెడివారు. ఈ విధముగా ఆకాలములో సంఘమునకు ఉపయుక్తమగు అనేక కార్యములు స్త్రీలు తమ వృత్తులద్వారా చేసెడివారు.

## స్త్రీలు - ఘోషా పద్ధతి

ఆకాలములో ఒక రాజుల కుటుంబములోను, సామంతుల కుటుంబములలో తప్ప మరెక్కడ ఘోషాపద్ధతి కనిపించదు. ఆ స్త్రీలు మేలిముసుగు ధరించెడివారు. సామాన్య స్త్రీలు పురుషులతోబాటు బయట పనులను, పొలములలో పనిచేయుట, బట్టలు కుట్టుట మొదలైనవానిని చేసెడివారు. శ్రీశైలమునకు వెడలు యాత్రికులతో 'పుణ్యాంగనలు' ఉండేవారని పండితారాధ్య చరిత్రలో పేర్కొనబడింది. ఇక వీరశైవమతము స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్రమిచ్చినందున 'ఘోషా' ప్రసక్తియేలేదు.

## ఆటవిక - స్త్రీలు

మనమింతవరకు పల్లెలలోను, పట్టణాలలోను ఉన్నటువంటి స్త్రీలను గురించి మాత్రమే తెలుసుకొన్నాము. కాని, అడవులలో నివసించు స్త్రీలు కూడా ఉండేవారు. వారినిగురించి మనకెక్కువగా సాహిత్యము మూలముగా తెలియగలదు. వారిలో మనకెక్కువ పరిచితులైనవారు ఎఱుకజాతివారు, చెంచు స్త్రీలు.

ఎఱుక జాతి స్త్రీలు ఎఱుక చెప్పుటయందు అనగా రాబోవుకాలమున జరుగు సంగతులు చెప్పుటయందు సమర్థులు. ఇంతేకాక వారు చెయ్యి చూసి భవిష్యత్తును చెప్పేవారు. ఈ చెప్పునట్టి పద్ధతికి సోది చెప్పుట

అని పేరు. వారొకవిధమైన స్వరముతో చెప్పేడు మాటలను తిరిగి చెప్పు చుండుటచేత, ఈనాడు ఒక విషయము పదే పదే చెప్పినయెడల ఏమిటా సోదె అని అంటూ ఉంటాము. ఈ ఎఱుకలవారిని తక్కిన స్త్రీలందరు హెచ్చుగా ఆదరించెడివారు. రాజాంతఃపురములలో, సామంతుల ఇండ్లలో వారి రాకకు ముఖ్యముగా ప్రాధాన్యత ఉండెడిది. పురుషులు కూడా తమ భవిష్యత్తును ఎఱుకల మూలమున తెలుసుకొనుటకు ఉవ్విళ్ళూరు చుండెడివారు. రాజులు ముఖ్యంగా యుద్ధములకు వెళ్ళేటప్పుడు తమకు విజయము కలుగునో లేదో అని తెలుసుకొనుటకు, స్త్రీలు తాము వలచిన వాడు నాథుడగునో కాదో అని తెలుసుకొనడానికి ఎక్కువగా ఎఱుకలను పిలిపించెడివారు. ఈ ఎఱుక జాతి స్త్రీలు ఒకచోట స్థిరముగా ఉండక తిరుగుతూ ఉండేవారు.

## శ బ ర స్త్రీ లు

ఎఱుక స్త్రీలు ఆటవికులైనా, పల్లెలకు, పట్టణాలకు వృత్తి ధర్మము కోసరం వచ్చెడివారు. కాని శబరస్త్రీలు తమ అటవీ స్థలములను విడిచి వచ్చెడివారు కాదు. వారు అడవి జంతువుల స్వరూప స్వభావములను ఎఱిగిన వారు. విల్లమ్ములను ధరించి జంతువులను చంపు నేర్పు గలవారు. ధైర్య సాహసములతో ప్రవర్తించుచు, గృహ కృత్యములను నిర్వహించెడివారు. భర్తలతో సమాన హక్కులు గలిగి ఉండేవారు కాని వారికి లోబడి ఉండెడి వారు కారు.

ఎఱుకలు, శబరస్త్రీలు నల్లని దేహముగలవారైనా, మెఱుగులు గ్రక్కుచున్న కండ్లతో, మంచి శారీరక సౌష్ఠవముతో, దర్శనీయలై ఉండెడివారు. వారు చమరీ మృగము వెండ్రుకలతో చేసిన సవరములు వాడెడివారు. వారి ఆహారము వెదురుబియ్యము. ఈ బియ్యమును స్ఫటికరాయితో చేసిన రోటిలో పోసి, ఏనుగుదంతపు రోకటితో దంచెడివారు. జీటిక కల్లు త్రాగెడివారు. వెదురునుండి వచ్చు ముత్యములను ధరించి, ఆటలాడుకొనుచు, వారు గీతములను పాడేవారు. అనేక రాగములు పాడుట వారికి వచ్చును.

పై ఆటవిక స్త్రీల జీవితమును బట్టి వారికి స్వాతంత్ర్యము కలదని విశద మవుతున్నది.

## స్త్రీలు - విద్య

ప్రాచీన కాలములోవలెనే ఈ కాలములోకూడా స్త్రీలలో క్రమశిక్షణతో కూడిన విద్య నభ్యసించినవారు చాలా తక్కువ. ఆ విద్యను పొందినవారు కూడా రాజ కుటుంబములోని స్త్రీలు, సామంత కుటుంబములలోని స్త్రీలు, వేశ్యలు, కళావంతులు మాత్రమే. సాంసారికజీవితమును నడుపుచున్న తక్కిన స్త్రీలకు విద్య అనవసరమను అభిప్రాయము వ్యాప్తిలో ఉండెను. వాత్స్యాయన కామసూత్రములలో కూడా పైవారికి మాత్రమే క్రమబద్ధమైన విద్య నిర్దిష్టమైనదని తెలియగలదు. వారు నేర్చుకొనదగిన విద్యలను ఇట్లు నిరూపించియున్నాడు.

1. చదువు.
2. వ్రాత.
3. గణితము.
4. సంగీతము.
5. నాట్యము.
6. వాద్యప్రవీణత.
7. చిత్రలేఖనము.
8. చేతి పనులు:—

1. విగ్రహములను పూలచే అలంకరించి నైవేద్యము పెట్టుట.
2. ముగ్గులు పెట్టుట, పరుపులు, తలగడలు పూవులతో నింపుట.
3. దంతములకు, వస్త్రములకు, శరీరమునకు, గోళ్లకు రంగులు వేయుట.
4. జపమాలలు, హారములు. పూలమాలలు గుచ్చుట.
5. దారముతోగాని, నారతోగాని చిలుకలను, పూవులను, గుత్తులను తురాయిలను, తలగడ కుచ్చులను తయారుచేయుట.
6. బొమ్మలను, విగ్రహములను నిర్మించుట.
7. పానీయములు — వంటలుచేయుట.
8. ఆభరణములు, వస్త్రములు ఇతరులకు అలంకరించుట.
9. మాట్లాడుటలో మెలకువలు గ్రహించుట.

10. సాధారణ పరిజ్ఞానము.

11. పొడుపు కథలు, పద్యములు నేర్చుట, వినోదక్రీడలు.

12. శరీర వ్యాయామము - కత్తి, దండము, విల్లు బాణము-అనువాని నుపయోగించ నేర్పు సంపాదించుట.

పై విద్యలన్నియు తీరికయున్నవారికే తప్ప తక్కిన స్త్రీలకు కావని ఆయా విషయములనుబట్టి గ్రహింపవచ్చును. అంతేకాక ఆ విద్య లన్నియు క్షత్రియ కన్యలు, సామంతుల బాలికలు నేర్వదగినవిగా నున్నవి. అందుకే ఆ రోజులలో ఈ విద్యలు వారు విధిగా నేర్చెడివారు.



తక్కిన సామాన్యజాతి స్త్రీలు ఈ విధముగ క్రమబద్ధమైన విద్య నేర్వకపోయినను పురాణములు, భారత భాగవత రామాయణములు, పురాణ గాథలు వినుటయందు ఆసక్తియేగాక శ్రద్ధను కనపరచేవారు. శివరాత్రి ఉత్సవమప్పుడు స్త్రీలు పురుషులతోబాటు శివునికి సంబంధించిన కథలు వినుటయందు పాల్గొనిరని పండితారాధ్య చరిత్రవల్ల తెలియుచున్నది. వారు జాగారము చేయుచు రాత్రి అంతయు పాటలు పాడుచుండెడివారు.



భోగినీ స్త్రీల విద్యావిధానము పైవిద్యావిధానమునకు విలక్షణముగా నుండెడిది. ప్రతి భోగిని స్త్రీయు విధిగా ఎనిమిదవ ఏటనుండి నాట్యవిద్యలో శిక్షణ పొందవలసినదే. నాట్యవిద్యలోనేకాదు. ఆమె సంగీతమున, సాహిత్యమున, చిత్రలేఖనమున ప్రవీణురాలు కావలెను. ముఖ్యముగా నాట్యము ఆమె జన్మహక్కు.



చల్లవ అను వేశ్య సమస్త గాంధర్వ విశారద యని చెప్పబడియున్నది. క్రీడాభిరామములో ఒక వేశ్యాగృహమున చిత్రశాలావిష్కరణము ఎంతో గొప్పగా జరిగినది. అందలి చిత్రములన్నియు శృంగారరసాత్మకములే. గోపికాకృష్ణులు. అహల్యాసురపతులు, దాశకన్యాపరాశరులు, తారాచంద్రులు, వారి సమాగమ చిత్రములు అందుండినవి. ఈ చిత్రశాలతోగూడిన వేశ్యాగృహములు వైభవమున రాజభవనములను మించియుండెడివి.

మధ్యయుగములోనే రాణి కాకతిరుద్రాంబ, నాయకురాలు నాగమ్మ వెలసినారు. అంతేకాక అనేక కవయిత్రులుకూడా ఉండినట్లు తెలియుచున్నది.

వారిలో చానమాంబ ప్రథమురాలు, ఆమె రణతిక్కన అమ పేరు గాంచిన ఖడ తిక్కనార్యుని కులపత్ని. కవిబ్రహ్మ తిక్కనకు వరుసకు వదినెగారు. ఆమె భర్త రణరంగమునుండి పారిపోయి తన గృహమునకురాగానే అతనిని దెప్పుచు. అతనిలో శౌర్యము రేకెత్తునట్లు వెంటనే ఆమె కంఠమునుండి ఈ విధముగా సరస్వతీదేవి పలికించింది.

పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడు వారమయితిమి
వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్.

చానమాంబ చక్కని కవితాత్మగల కాంతయని ఆ కందమే చాటి చెప్పుచున్నది. ఖడ్గ తిక్కన తల్లికూడా ఆమెకు తీసిపోలేదు. ఆమె తన కుమారుడు పిరికిపందగా రణరంగమునుండి పారిపోయివచ్చుట సహించలేదు. అతడు యుద్ధమున మరణించినా సంతసించెడిదిగాని, భీరువై ఈ విధముగా తలదాచుకొనుట ఆమెకు తలతీసివేసినట్లైనది. అతనిని తిరిగి రణరంగమునకు మళ్లించుటకుగాను తన కుమారునిగాంచి ఇట్లు చెప్పినది.

అసదృశముగ నరివీరుల
పసమీరగ గెలువలేక పందక్రియన్నీ
వసివైచి తిరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క! పాలున్ విరిగెన్.

ఈ విధముగా ఆ కుటుంబములో అత్త కవయిత్రి. కోడలు కవయిత్రి. కవిబ్రహ్మ తిక్కన సోమయాజి ఈమె కుమారుడుకాడు. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు వారిని గురించి వ్రాయుచు "ఈ యాడువారి ప్రతాపాగ్నిచ్ఛటల ధాటి కోహటించలేకయేకదా, ఖడ్గ తిక్కన రణసీమకు మగుడవెడలి యద్భుతముగ నరివీరుల కసిమసంగి విజయలక్ష్మిని చేపట్టినాడు. స్వదేశమునకు, సమర విజయమును సముపార్జించిన యా కవయిత్రుల తేజోలేఖిని యాంధ్రదేశమున నేటికిని నజరామరకీర్తులతో శోభిల్లుచున్నద"ని చెప్పినారు.

శాసనములలో దేవకవి కొమ్మె పేర్కొనబడినది. ఈమె కవయిత్రి అనియు, దేవాలయ గణికలలో ఒకతె అనియు చెప్పవచ్చును.

## స్త్రీలు - వివాహము

ఈ విషయముగురించి ప్రాచీనకాలమునకు సంబంధించినవరకు ఇదివరకే ప్రస్తావించియున్నాము. అప్పటికి, మధ్యయుగము నాటికి ఎక్కువ భేదము కనిపించదు, ఈ కాలములోకూడా హైందవులు విహితమయిన శాస్త్రీయసంస్కారములలో వివాహము ప్రధానమైనదని నమ్మినారు. మానవుని జీవితమున పురుషార్థములలో ధర్మార్థకామములను సాధించుటకు వివాహము తప్ప వేరుమార్గములేదని, ఎల్లకాలములలో నమ్మిన విషయము. వివాహముగురించిన వివరములు తెలుసుకొనవలెనని ఈ దిగువ ప్రశ్నలను మనము పరిశీలించి, వాటికి మధ్యయుగములో ఎటువంటి సమాధానము దొరకెనో గమనించవలెను.

(1) వివాహకాలమందు వధూవరులలో చూడదగిన లక్షణము లెవ్వి

(2) కన్యలకు, యువకులకు ఏ వయస్సులో వివాహము చేయవలెను ?

(3) కట్నములు పుచ్చుకొను ఆచారమున్నదా ?

(4) బహుభార్యాత్వము కలదా ?

(5) 'సహగమనము' ఉన్నదా ?

ఆ రోజులలోకూడా మను ధర్మశాస్త్రము ఏర్పరచిన నిబంధనలే వివాహ విషయములలో వారు అనుసరించుచుండిరి. ఆ ధర్మశాస్త్రప్రకారము వధూవరులిరువురు మంచి వంశమువారై, శీలవంతులై ఉండవలెను. వధువు లక్షణములు బాహ్యము, అభ్యంతరము అని రెండు విధములు బాహ్యముగా ఆమె ఆరోగ్యవతి, సౌందర్యవతియైయుండుటయేగాక సమవిభక్తమైన అంగసౌష్ఠవముగలది కావలెను. రోమవిహీనకారాదు. అభ్యంతర లక్షణములలో తెలివి, చురుకుదనము గలిగియుండుట, శంకలేని ప్రవర్తనకలదియైయుండుట ముఖ్యమైనవి. నన్నెచోడుడు కుమారసంభవములో పై విషయములన్నింటిని వివరించియున్నాడు. సప్తఋషులు హిమవంతునియొద్దకేగి ఈశ్వరుని అల్లునిగా చేసుకొనమని ఇట్లు తెలిపిరి. "శివుడు కులములకు రాజు. గోత్రములకు

పతి. దేవతలకు, దేవధనముల కధీశుడు. దానముల కధికారి. త్రిమూర్తుల కాధి మూర్తి కనుక నీ కల్లుడగుటకు అర్హుడు. మఱియు అతడే మమ్ములను పంపి యున్నాడు. కాబట్టి వధువును చూడగోరుచున్నామని సప్తఋషులు చెప్పగావే హిమవంతుడు పార్వతీదేవిని పిలువనంపినాడు, ఆమె రాగానే ఆమెకుగల సౌందర్య స్వభావ సమస్త లక్షణములను పరీక్షించి తప్పక ఆమె శివునికి తగిన వధువని నిశ్చయించిరి. దీనినిబట్టి మరో విషయము తేలినదేమనగా వధువు అంతకుముందే ఒకనిని వరించినప్పటికి, తండ్రి అనుమతిలేనిదే సాధారణముగ వివాహమాడెడిదికాదు. పార్వతి తపస్సుచేయుచున్నప్పుడే శివుని వరించినది. శివుడుకూడా బ్రహ్మచారి రూపమునవచ్చి, పార్వతిని పరీక్షించి ఆమె మనస్సు గ్రహించి, సంతోషించి తన అభిప్రాయమును వ్యక్తపరచి నాడు. పార్వతి అంత అతని ఉద్దేశమును తన తండ్రియైన హిమవంతునికి తెలియపరచి, అతని అనుమతితోనే వివాహమాడుట ఉచితమని శివునికిచెప్పిన, శివుడు సప్తఋషులమ హిమవంతునివద్దకు రాయబారము పంపినాడు నన్నె చోడుని కుమారసంభవములోనున్న విషయములివి. గ్రంథకర్త ఈ కావ్యమును వ్రాసినప్పుడు తాను జీవించిన కాలమునాటి ఆచార వ్యవహారములు అందులో చక్కగా పొందుపరచిచాడు.

అట్లే నన్నయకూడా, తాను వ్రాసిన మహాభారతములో గాంధారీ వివాహముగూర్చి చెప్పినప్పుడు పై అచారమునే వ్యక్తపరచినాడు. పుట్టంధుడగు ధృతరాష్ట్రునకు గాంధారి నిమ్మని భీష్ముడు గాంధారి తండ్రియైన సుబలరాజునకు వర్తమానము పంపినాడు. అతడు అందుకు అంగీకరించి, గాంధారి అంగీకారముకూడా పొందినాడు. తండ్రి యాజ్ఞను శిరసావహించుట తన ధర్మమని గాంధారి తండ్రి నిశ్చయించిన వరునే వివాహమాడెదని చెవుతూ "పితృవచన దత్తగా దన్ను నిశ్చయించి నాకు పతి యిమ్మహీపతిగాని యొరులనొల్ల" అని నుడివినది. గాంధారి తండ్రియాజ్ఞననుసరించి పెండ్లియాడిన విషయము మూల సంస్కృతభారతమునలేదు. కాని తెలుగులో ఉన్నది.

రాజ్యపాలకులలో వివాహములు రాజకీయ సంబంధాలు దృఢపరచు కొనుటకు జరిగేవని చెప్పకొనుచున్నాము. అది మాధ్యమికయుగములో కూడా కనివిస్తున్నది. రాజరాజచోళుడు దక్షిణదేశములో పరిపాలన చేయుచున్నప్పుడు ఉత్తరమున కొన్ని ప్రాంతములు ముఖ్యముగా వేంగీమండలమంతయు అల్లో

కల్లోలముగాను అరాజకముగానుండెను. అంత అతడు వేంగీరాజ్యమును వశపరచుకొని, తన రాజ్యమునకు, వేంగీరాజ్యమునకు విడిపోని సంబంధము కల్పింపదలచి వేంగీరాజ్యమునకు శక్తివర్మ నభిషిక్తునిచేసి, శక్తివర్మ సోదరుడగు విమలాదిత్యునికి తన కుమార్తె కుందవాదేవినిచ్చి పెండ్లిచేసినాడు. ఈ వివాహము మూలముగా రెండు వంశములను రాజకీయముగా కలిపినాడు. విమలాదిత్యుని మరో భార్య అంకిదేవి. ఆమె కళింగ రాజపుత్రిక. ఇది కూడా రాజకీయ వివాహమే. ఈ విధముగా రాజులమధ్య రాజకీయ వివాహములు జరిగేవి.

బాల్య వివాహములు ఆ కాలమునాటికే పరిపాటి అయినవి. రాజకుటుంబములలో కూడా ఈ అలవాటు కనిపిస్తున్నది. బాలచంద్రుడు పల్నాటి యుద్ధమునకు వెళ్ళుటకు ముందు తన భార్యయైన మాంచాల వద్దకు వెళ్ళినాడు. అప్పటి కతని వయస్సు చాలా తక్కువ. పెండ్లి అయిన తరవాత మాంచాలను చూచుట కూడా అదియే ప్రథమము. దీనికి కారణము వారిద్దరు చిన్నవారు కావడము. ఇందువల్లనే ఆ రోజులలో విపాహము చాలా చిన్నతనములో జరిగేదని చెప్పవచ్చును.

ఆ రోజులలో బహు భార్యాత్వము ఒక్క రాజ కుటుంబములలో తప్ప తక్కినవారిలో లేదనియే చెప్పవచ్చును. ఒకవేళ ఉన్నను తమకు బిడ్డలు లేనప్పుడే ఒక భార్య యుండగా మరియొక భార్యను పెండ్లియాడెడివారు.

పెండ్లికుమార్తెకు వివాహకాలమున అన్ని కులములవారూ స్త్రీ ధనముగా కొంత కట్న మిచ్చెడివారు. దీనికే 'అరణము' అని పేరు. దీనికిని, పెండ్లి కుమారున కిచ్చెడి కట్నమునకును ఏ విధమైన సంబంధము లేదు ఇది తండ్రి కూతురునకు వివాహ సమయమున ఇచ్చెడి కానుక. నన్నెచోడ కవి కుమార సంభవములో పార్వతి వివాహమై ఈశ్వరునితో కైలాసమునకు వెళ్ళునప్పుడు హిమవంతుడు అరణము ఇచ్చినట్లు చెప్పియున్నాడు. అనుగురాజునకు మైలమాదేవినిచ్చి పెండ్లి చేసినపుడు ఆమె తండ్రి రెండవ గొంకరాజు తన కుమార్తెకు తాను జయించిన పల్నాటి రాజ్యమంతయు నరణముగా నిచ్చినాడు. శీలమాదేవి వివాహమైనప్పుడు ఆమె తండ్రి స్త్రీ ధనముగా ఆమెకు ఏమి కావలయునో కోరుకొమ్మనగా, ఆమె తనకు వెయ్యి గోవులు, వెయ్యి గొఱియలు ఇమ్మని చెప్పినది.

మన చారిత్రక కాలమున సహగమనము సర్వసాధారణమైనట్లు తెలియు చున్నది. క్రీ శ. 1211 లో రెండవ గొంకరాజు కోశాధికారి బంధువు ఒకామె నిడుబ్రోలులో సహగమనము చేసినది. పల్నాటి వీరచరిత్రలో అనపోతు చనిపోయినపుడు అతని భార్య సహగమనము చేసినది. అలరాజు భార్య పేరి దేవి భర్త చనిపోగానే అత్తగారికి, మామగారికి మ్రొక్కి, వారి ఆశీస్సులను పొంది, శివుని ప్రార్థించి, భర్త చిచ్చులో తనంతట తానురికి భర్త శవముతో తాను కూడా దగ్ధమయినది. మన్మథుడు శివుని వలన దగ్ధమైన వెనుక రతి యిట్లు చెప్పినట్లు నన్నెచోడుడు చెప్పియున్నాడు.

"కుల పాలికా ధర్మవృత్తి నైనం బురుషు
తోడ పరలోకంబున కరుగ వలయు
నవశ్యం బగ్ని ప్రవేశంబు సేయుదు"

## స్త్రీలు - అలంకరణ

ఆనాటి స్త్రీల వస్త్రధారణ, ఆభరణ విశేషములు సాహిత్యము ద్వారా, శిల్పముల ద్వారా తెలుసుకోవచ్చును. పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథుడు శివరాత్రి మహోత్సవమునకు వచ్చినటువంటి స్త్రీలను వర్ణిస్తూ, వారి వారి వస్త్రాలంకరణములను చక్కగా చిత్రించినాడు. అక్కడకు వచ్చిన వారు మూడు రకములైన చీరలు ధరించినారట. అవి సాదా చీరలు, సన్న చీరలు, పట్టు చీరలు. పట్టు చీరలలో 57 రకాలు తెలిపినాడు. సాధారణముగా చీరలు పండ్రెండు మూర లుండెడివి (పండ్రెండు మూరల పసిడి పుట్టంబు). ఉత్తమకుల స్త్రీలు బహు సున్నితములైన చీరలు ధరించేవారు. బసవని భార్య ధరించిన చీర శరీరకాంతిని ప్రసరింపచేయునంతటి సన్నముగ నుండెడిది.

ఈ చీరలు నేయుటకు సాధారణముగా స్వల్పకాలమే పట్టినను కొన్ని సమయములలో అతి నాజూకు చీరలు అల్లుటకు ఎన్నో సంవత్సరములు తీసు కొనెడివారు. ఒక సాలెవాడు ఒక చీరను పండ్రెండేండ్లు నేసి, దానిని బసవనికి సమర్పించినాడు.

మేలి ముసుగు ధరించు పద్ధతి ఆ కాలములో నుండెను. సన్నపు చీరలు కట్టునప్పుడు స్త్రీలు రెండు ముతక వస్త్రములను జోడించి, ఆ సన్న చీరపై

చుట్టెడివారు. వలసినపుడు చీరలను తెరలుగా ఉపయోగించెడివారు. చీరలను నడుముకు బిగించి కట్టెడివారు.

చీరలతో రవికలు, కుప్పసములు ధరించెడివారు. రవికలు శరీరమున చుట్టు గుత్తముగ నుండెడివి. మెడయందు మంగళసూత్రము విశదముగ కనిపించెడిది. కొంతమంది వదులు కుప్పసములు ధరించెడివారు. పల్నాటి వీర చరిత్రలో మాంచాలి జలతారు పూవుల పట్టు రవిక తొడిగినది. సామాన్య స్త్రీలు సాధారణముగా గుడ్డల రవికలే ధరించెడివారు. ప్రత్యేకముగా, ఉత్సవ, వ్రత వివాహ సమయములందు మాత్రమే పట్టు రవికలు ధరించెడివారు. యాత్రలు వెళ్ళునపుడు, ఇతర ప్రాంతములకు వెళ్ళునపుడు పాదరక్షలను వేసుకొనెడివారు.

## ఆ భ ర ణ ము లు

ఆ రోజులలో స్త్రీలకు ఆభరణములపై మోజు ఎక్కువగా ఉండేది. వారు ఆపాదమస్తకము నగలు పెట్టుకొనెడివారు. ఆ నగలకై వాడెడు లోహములు ఆయా స్త్రీల హోదాల ననుసరించి యుండెడివి. కాని ప్రతి ఒక్కరు మంగళసూత్రములను మాత్రము బంగారముతోనే చేయించుకొనెడివారు. సాధారణముగా నగలన్నియు బంగారముతోనే చేయబడినను, ఆటవిక స్త్రీలు, యోగినులు, ఎఱుక, చెంచు వనితలు ఇత్తడి, కంచు, ఇనుముతో చేసిన నగలను ధరించెడివారు.

స్త్రీలు తలకు శశి, రవిభూషలు ధరించెడివారు. ఇవి సూర్యచంద్రాకారములలో నుండెడివి. వీనిలో పాపిటకు కుడివైపున సూర్యుని, ఎడమవైపున చంద్రుని గ్రుచ్చెడివారు. ముక్కునకు ముంగరను, చెవులకు తాటంకములు బంగారముతో చేయబడి, రత్నములతో కూడా పొదుగబడి యుండెడివి. బవిరెలు, కుంటీలు కూడా చెవులకు ధరించేవారు. వీటి చివర ముత్యములు గుచ్చులుగా వ్రేలాడేవి. మెడకు బంగారముతోగాని ముత్యాలతోగాని చేయబడిన పట్టెడ, ముత్యాల హారములు, చిన్న సరములు శుద్ధ సరితీగెలు ధరించేవారు. భుజములకు సంది దండలు, బంగారు పూసలతోను, మణులతోను గుచ్చబడిన దారములను కట్టుకొనెడివారు. చేతులకు గాజులు, కంకణములు, వేళ్ళకు ఉంగ

రములు నియమితమైన నగలు, నడుముకు బంగారుతో చేయబడిన వడ్డాణము ధరించేవారు. ఒక్కొక్కసారి మొలనూలు అనగా బంగారు ముక్కలను దారముతో గ్రుచ్చి, వడ్డాణముకు బదులుగా ధరించేవారు. కాళ్ళకు అందెలు, కాలివేళ్ళకు మట్టెలు, పిల్లాండ్లు అందరూ ధరించెడివారు. వానిని వెండితో చేసేవారు. బంగారపు అందెలు, మట్టెలు, పిల్లాండ్లు రాజకుటుంబములోని స్త్రీలు మాత్రమే ధరించవలెనను ఆచారముండెడిది. ఈ నగలన్నీ తీర ప్రాంతములవారు, పల్లెలలో, పట్టణములలోని స్త్రీలు ధరించెడివి.

ఆటవిక స్త్రీలు దేశద్రిమ్మరులు కావడముచేతనేమో యినుపనేవళములు (గొలుసులు), రుద్రాక్ష తావళములు మెడలో ధరించెడివారు. చెవులకు సంకు పూసలు, చేతులకు నల్ల గాజులు, కాలిప్రేళ్ళకు తగరపు పిల్లాండ్లు ఉండేవి. ఎప్పుడూ అడవులలో ఉండు స్త్రీలు బరువుగల కంచు, రాగి, వెండి నగలను పెట్టుకొనేవారు వారికి సంకు (శంఖు) పూసలు చాలా ఇష్టము. వానిని చేతులకు నల్ల గాజులతో ధరించెడివారు. చెవులకు, ముక్కులకు, అందెలకు అన్నింటికి సంకపు గాజు పూసలే వాడెడివారు. ఐదు రంగుల గాజుల పూసలు ఒకే హారముగా కట్టి వేసుకొనేవారు. ఇత్తడి ఆభరణములు కూడా ఉండేవి.

## రుద్రాంబ

రుద్రాంబ కాకతి గణపతిదేవ చక్రవర్తి కుమార్తె. కాకతీయ సామ్రాజ్యమును చక్కగా పరిపాలించి గొప్ప పేరు తెచ్చుకొనిన ఆంధ్ర స్త్రీ ఈమె. ఈమె పరిపాలించు కాలముననే మార్కోపోలో అను వెనిస్ దేశ యాత్రికుడు మోటుపల్లి రేవును సందర్శించి, అచ్చట పరిపాలన కట్టుదిట్టముతో నుండిన దనియు, పరిశ్రమలు, వాణిజ్యము అభివృద్ధిలో నుండెననియు, సముద్ర వ్యాపారము కూడా ఈమె ప్రోత్సహించిన దనియు తెలిపియున్నాడు.

పుత్ర సంతానంబు లేనందున గణపతిదేవుడు రుద్రాంబకు పురుషోచిత శిక్ష నొసంగినాడు. తన తదనంతరము ఆమె సింహాసన మెక్కునట్లు నిశ్చయించినాడు. తండ్రి జీవించి యున్నప్పుడే ఆమె సైన్యము నడుపుటలోను, రాజ్య పరిపాలనములోను గొప్ప పేరు పడిసింది. ఆమె రుద్రదేవ మహారాజని పురుషనామము ధరించి, తండ్రికి చేదోడువాదోడుగా పరిపాలనాభారము వహించినది. తండ్రి మరణానంతరము 1260 లో సింహాసనము నధిష్ఠించినది.

స్త్రీ అయిన రుద్రాంబ రాణి కాగానే, అబల యని ఆమెపై అనేక సామంతులు తిరుగుబాటు చేసి, స్వతంత్రులగుటకు ప్రయత్నించిరి. ప్రతిభావంతురాలు, ధైర్య సాహసములు గల రుద్రాంబ తనకొచ్చిన కష్టముల నన్నిటిని ఎదుర్కొని, తన తండ్రినుంచి సంక్రమించిన విశాల సామ్రాజ్యమును రక్షించి సమర్థతతో పరిపాలించినది. ఆమె మీద తిరుగుబాటు చేసిన వారిలో చోళరాజగు రాజేంద్రుడు, పల్లవ రాజగు కొప్పెరుం జింగడు, ఏరువ మల్లిదేవుడు, కేశవదేవుడు, అల్లుగంగు ముఖ్యులు. వారిలో కొప్పెరుంజింగడు గణపతిదేవుని చేతిలో కూడా ఓడిపోయినాడు. రుద్రాంబ వీ రందరిని ఓడించి శాంతి నెలకొల్పినది. ఈ యుద్ధములో స్వామిభక్తులగు రుద్ర, అంబదేవ, త్రిపురాంతకాది సేనానులు ఆమెకు సహాయము చేసినారు.

రుద్ర ఎవరో తెలియదు.

అంబదేవుడు రుద్రమదేవి కాలములో తిరుగుబాటు చేసి స్వతంత్రుడయ్యెను.

త్రిపురాంతకుడు ఆమెకు విశ్వాసపాత్రుడుగానే ఉండెను.

ఈ యుద్ధముల అనంతరము రుద్రాంబ ఓరుగల్లు కోటను మరమ్మతు చేయించింది. రాతి కోటకు లోపలి భాగములో మెట్లు పెట్టించింది. పెద్ద పెద్ద బురుజులను నిర్మించి కోట దుర్భేద్య మగునట్లు నిర్మించినది. ఆమె పాలనలో దేశము సుభిక్షముగ ఉండినది. తటాకములు త్రవ్వించి, మఠములను, దేవాలయములను కట్టించి, కాలువల ద్వారా పంట భూములను పెంపొందించింది.

రుద్రాంబకు కూడా కొడుకులు లేరు. ఆమెకు ముమ్మిడమ్మ, రుయ్యమ్మ అను ఇద్దరు కుమార్తెలు. రుయ్యమ్మను ఇందులూరి అన్నయ్యకిచ్చి వివాహము చేసినది. ముమ్మిడమ్మను మహదేవ రాజు కిచ్చినది. వారి సంతానమైన ప్రతాపరుద్రుని తన తదనంతరము రాజగునట్లు నిర్దేశించినది. ప్రతాపరుద్రుడు తన అమ్మమ్మకు పరిపాలనలో ఎంతో సహాయము చేసినాడు. ఈ విధముగా రాణి రుద్రాంబ ప్రజాహిత కార్యము లొనర్చి రాజ్యమును రామరాజ్యముగా పరిపాలించింది. మాధ్యమిక కాలమునాటి స్త్రీలను గురించి చదివినప్పుడు మేటి అయిన రుద్రాంబ గురించి తప్పక తెలుసుకొనవలెను. ఆమె

వలెనే ఘనత వహించిన మరి కొందరి స్త్రీలను గురించి కూడా తెలుసుకొన వలయును. అటువంటి వారిలో ఆమె సోదరి గణపాంబ ఒకరు.

## గ ణ పాం బ

గణపాంబ రుద్రమదేవి సోదరి. ఆమె అంత ప్రసిద్ధురాలు కాకపోయి నను ఆమెయంత సమర్థత గలది. ఆమె భర్త కోటబేతరాజు షట్సహస్ర (6000) గ్రామముల కధిపతి. అతనికి ఆమె రాజ్య పాలనలో చేదోడువాదో డుగా ఉండి, అతని మరణానంతరము రాజ్య భారమంతయు పూర్తిగా తానే వహించి, నలుబది ఏండ్లు స్వతంత్రముగ, ప్రజారంజకముగా పరిపాలించింది. ఈమె దేవాలయములకు అసంఖ్యాకములైన దానములు చేసినది.

## శీ ల మ

ఆ కాలమున రాజ్య తంత్ర ప్రవీణ అయిన మఱియొక మహిళ శీలమ. ఈమె బ్రహ్మనాయుని తల్లి. ఈమె రామాయణ మహాభారతములను బాగుగా చదివి, అందలి అంశము లన్నిటిని చక్కగా జీర్ణించుకొన్నది. అందువలన ఆమెకు మతము, సాంఘిక వ్యవస్థ, రాజనీతి, వీనియందు మంచి ప్రజ్ఞ పట్టు వడినది. గురజాల యుద్ధమునకు వెడలుటకు ముందు బ్రహ్మనాయునికి ఆమె చేసిన ఉపదేశము ఆమెకు గల రాజనీతి పరిజ్ఞానమును, సాంఘిక సంప్రదాయ విజ్ఞతయు విశదమవుతున్నవి. ఆమె చెప్పిన సూక్తులలో కొన్ని ఏమన: యుద్ధమునందు ఆటవికులనుగాని, గొల్లలనుగాని, కట్టెలవారినిగాని, దేవాలయ మున శరణుజొచ్చిన వారినిగాని, భార్యల వెనుక దాగుకొన్న వారినిగాని హింసించ కూడదు. శీలమ తన కుమారుడు ఊర లేనప్పుడు గూఢచారు లను గురించెడిది. ఈ విధముగ స్త్రీలుకూడా ఆ రోజులలో ఎంతటి రాజనీతి ప్రజ్ఞ కలిగి పురుషులకు సహాయము చేసెడివారో తెలియగలదు.

## నా య కు రా లు నా గ మ్మ

రుద్రాంబ, గణపాంబకన్నా ముందుగా యుద్ధ నైపుణ్యము, మంత్రాంగ సామర్థ్యము ప్రకటించిన నారీమణి నాగమ్మ. ఈమెను నాయకురాలని కూడా చెప్తారు. ఈమె వీర జగ్గారెడ్డి కుమార్తె, పంటరెడ్డి భార్య. ఆమె తన గ్రామ మున మంచి పలుకుబడి యుండి, అందరిచేత గౌరవింపబడు చుండెడిది.

ఒకసారి అనుగురాజు వేటకు వెళ్ళి తిరిగి వచ్చుచుండగా మార్గ మధ్యమున నాయరాకులు అతని కెదురు వచ్చి, తన గ్రామమున కాతనిని ఆహ్వానించి, అతనికి, అతని పరివారమునకు అఖండమైన ఆతిథ్య మిచ్చినది అనుగురాజు అందులకు చాలా సంతోషించి, ఆమెకు కావలసినది కోరుకొమ్మని ఆనతి నిచ్చినాడు. నాయకురాలు ఏడు ఘడియలు తాను పల్నాటి రాజ్యమునకు మంత్రిగా నుండునట్లు చేయవలసినదిగా అనుగురాజును కోరుతూ, అది కూడా తనకు ఎప్పుడు ఇష్టమో అప్పుడు వత్తునని అడిగినది. రాజు అంగీకారము, రాజ ముద్రికతో నున్న ఆజ్ఞాపత్రముపై లిఖిత పూర్యకముగా ఉండవలెనని నాయకురాలు కోరివది. రాజట్లే చేసినాడు. ఆమె అనాటినుంచి అప్పుడప్పుడు రాజాస్థానమునకు వచ్చెడిది. ఆస్థానములో బ్రహ్మనాయుడు తప్ప తక్కిన వారందరు ఆమెను గౌరవించెడివారు. నాయకురాలది గ్రహించి, బ్రహ్మనాయు నిపై కక్ష సాధించిదలచి, తగిన సమయమునకై వేచిఉండినది.

అనుగురాజు ఇలా ఉండగా ఒకనాడు మరణించినాడు. అతని వెనుక నలగాముడు రాజయినాడు.

నాయకురాలు నలగామ రాజువకు అనుగురా జిచ్చిన పత్రమును చూపి ఆమెను మంత్రిగా చేయమని వేడినది. అతడు అందు కంగీకరించి ఆనాటినుండి ఆమెను మంత్రిగా చేయుటయే కాక, ఆమె సలహా జవదాటెడి వాడు కాడు. ఆమె తన మంత్రాంగ చాతుర్యమును ప్రదర్శించ సాగినది. నలగామ రాజునకు అతని మంత్రికి మనస్పర్ధలు కలిగించినది. రాజ్యమును నలగామ, మలిదేవ రాజులకు చెరిసగము విభజన చేసినది. దీనివలన దాయాదులలో కలత లేర్పడి క్రమ క్రమముగా పల్నాటి యుద్ధమునకు దారి తీసినది. ఈ యుద్ధము రాజ్య నాశనమునకే కారణమయినది. నాయకురాలు ఈ యుద్ధములో అసాధారణ శక్తి సామర్థ్యములను చూపినది. ఎంతో పౌరుషముతో యుద్ధము చేసి, అనేక శూరులను చంపినది. కాని చివరకు బ్రహ్మనాయుని చేతిలో ఓడిపోయినది. ఒక స్త్రీవల్ల ఎంత మంచి జరుగునో అంత అరిష్టము జరుగుటకు కూడా వీలవు తుందని మనకు నాయకురాలి కథవల్ల తెలియగలదు. ఏది ఎట్లున్నను నాయకు రాలి శక్తి సామర్ధ్యములు అసామాన్యములని తెలియగలదు.

ఈ విధముగా ప్రవీణులయిన, చాకచక్యము గల స్త్రీ లనేకులు ఆ కాలములో ఉండిరని చెప్పుటకు ఉదాహరణగా పై కొంతమందిని గురించి మాత్రము చెప్పుటకు ప్రయత్నించినాను.

## విజయనగర కాలమునాటి స్త్రీలు

ఇంతవరకు మనము మధ్య యుగమునాటి స్త్రీలను గురించి ప్రసావించినాము. కాని ప్రత్యేకముగా అదే మధ్యయుగమునకు సంబంధించిన విజయనగర కాలమునాటి స్త్రీలను గురించి చెప్పుటకు ముఖ్యముగా ఒక కారణము కలదు. విజయనగరము సకల భోగములతో కూడినదై స్వర్ణయుగమని చెప్పుటకు తగిన హంగులు పొందియుండెను. అనేకమంది విదేశీయులు ఈ సామ్రాజ్యమును దర్శించి, తమ అపూర్వమైన అభిప్రాయములను వెలిబుచ్చినారు. నికోలో కోంటి, పీస్ అనే విదేశ చరిత్రకారులు ప్రత్యక్షముగా తాము చూసిన విజయనగరమును తమ గ్రంథములో వర్ణించినారు. ఆ సందర్భములో స్త్రీలను గురించి వారు వెలిబుచ్చిన అభిప్రాయములు పూర్తిగా నిజము కాకపోయినను కొంతవరకు ఆనాటి పరిస్థితులు మన కర్థమగుటకు వీలున్నది.

నికోలో కోంటీ ఈ విధముగా చెప్పినాడు. పురుషులు అనేకమంది స్త్రీలను వివాహ మాడెడువారు. స్త్రీలందరు భర్తలు మరణించగానే అతనితో అగ్నిప్రవేశము చేసెడివారు. అప్పుడు పరిపాలిస్తున్నటువంటి రాజు, ఆ రోజులలో పరిపాలిస్తున్న అందరి రాజులకన్నా గొప్పవాడు. అతనికి 12000మంది భార్యలు. వారిలో 4000 అతనితోబాటు నడుస్తూ, అతను వెళ్ళినచోట్లకంతా వెళ్లుచూ, వంటపని చూసెడివారు. మరి 4000 మంది చక్కగా సింగారించుకొని అతనితోబాటు గుఱ్ఱములమీద స్వారీచేయుచు వెళ్లేవారు మిగతావారు పల్లకీలలో అతనిని అనుసరించేవారు. వారిలో 2000 మంది మాత్రము అతడికి నిజమైన భార్యలు. వారందరు అతనితో సహగమనముచేయవలెనని రాజాజ్ఞ ఆవిధముగ చేయుట తమకు గౌరవమని కూడా వారు భావించిరి. కాని నికోలో కోంటీ చెప్పినదంతా నిజము సత్యము కాదు. అతడు తను కాంచిన ప్రతీ స్త్రీ రాజుయొక్క భార్య అని తలచి ఉండవచ్చు. ఆ రోజులలో రాజాంతఃపురములో అనేకమంది స్త్రీలు పరిచారికలుగా ఉండేవారు. వారిలో కొంతమంది అత్యంత సౌందర్యవంతులై, రాణులను మించిన నగలను, దుస్తులను ధరించెడివారు.

పేస్ అను మరో విదేశీయుడు విజయనగర స్త్రీలను ఈ విధముగా వర్ణించినాడు. రాజుకు శాస్త్రోక్తముగా పండ్రెండ్రుు భార్యలు. వారిలో ముగ్గురు ముఖ్యమైన భార్యలు. అంటే అతని తర్వాతరాజ్యార్హులు వారి ముగ్గురు సంతానమే కాని ఇతరులు కారు. వారి ముగ్గురిలో ఒకామెకే పుత్రుడు కలిగినప్పైన అతడే రాజవుతాడు. అతడు పెద్ద రాణి కొడుకే అయి ఉండనవసరములేదు. చిన్న రాణికి పుట్టినను ఫరవాలేదు. సాధారణంగా ఈ పండ్రెండ్రుు రాణులలో పదకొండుమంది పక్కరాజ్యాలకు సంబంధించిన రాజ పుత్రికలు. పండ్రెండవరాణి వేశ్య (Dancing Girl). రాజు వివాహమునకు పూర్వమునుండి ఆమెతో సంబంధముకలిగి, తను రాజు కాగానే ఆమెను వివాహమాడెదని ఒట్టు పెట్టుకొని, ఆ ప్రకారమే రాజయిన తర్వాత ఆమెను తన కడగొట్టు రాణిగా చేసుకొంటాడు.

రాజభార్యలు పరదా పద్ధతిని అవలంబించేవారు. అందుకే వారు ఎచ్చటికి వెళ్ళినా పూర్తిగా మూసివేసిన పల్లకీలలోనే వెళ్లేవారు. వారొక్కొక్కరికి ప్రత్యేక గృహముండెడిది. దానిని స్త్రీలే కాపాడెడివారు. అచ్చట పనిచేయువారందరూ స్త్రీలు. అక్కడ పురుషులంటూ ఉంటే, వారు పురుషత్వములేని నపుంసకులు. ఏ పురుషుడు రాణుల అంతఃపురమునకు వెళ్లుటకు వీలులేదు. ఎప్పుడైనా రాజుయొక్క ఆహ్వానము పురస్కరించుకొని పెద్ద ఉద్యోగస్థుడుగా ఉన్నటువంటి వయసుమీరిన వృద్ధుడు అచ్చట అడుగుపెట్టవచ్చు. ఈ రాణులకు ఎంతో ఆస్తి ఉండెడిది. ధనము, భూములు, వెండి, బంగారు, రత్నాలు, రత్నవైడూర్యాలు, ముత్యాలు వెలలేనన్ని వారివద్ద ఉండెడివి. ఒక్కొక్క రాణివద్ద కనీసము అరవైమంది దాకా చేటికలు ఉండేవారు. రాజాంతఃపురములో 12,000 మంది స్త్రీలు ఉన్నట్లుగా పేస్ చెప్పినాడు. అతను ఇంకా ఈ విధముగా చెప్పినాడు.

అంతఃపురములో ఉన్నటువంటి స్త్రీలలో కొంతమంది కత్తిపట్టి యుద్ధము చేయగలరు. కొంతమంది కుస్తీలు పట్టగలరు. మరికొంతమంది బూరగలు వాయించగలరు. చాకలులు, వంటలవాళ్లు, తోటవారు, ఇతర వృత్తులు చేసేవారు అంతా స్త్రీలే. రాజును కాపాడుటకు ఏ విధంగా భటులు రాజప్రాసాదములో ఉండెదరో అదేవిధముగా రాణుల అంతఃపురములో స్త్రీభటులు ఉండేవారు. ఇంతమంది ఉన్నటువంటి అంతఃపురము ఎంత వైశాల్య

ముతో కట్టబడి ఉండేదో ఊహించవచ్చు. అదే చిన్న పట్టణమంత ఉండేది. అచ్చట మంచి బాటలు, దుకాణాలు, పనివారు నివసించుటకు ఇండ్లు కూడా ఉండెడివి. ఒక్కొక్క రాణిక్రింద పెద్ద ఆవరణ ఉండెడిది. మరో విషయ మేమనగా రాజు ముఖ్య భార్యలు ముగ్గురు ఎంతో సఖ్యముతో, ఒకరిపై ఒకరు ద్వేషాసూయా భావములు లేక ఉండేవారు. రాజుకూడా తన రాణులవద్దకు వెళ్లుటకు పూర్వము వారి అనుమతి బడసేవాడు. అతడు అంతఃపుర సేవకు డయిన నపుంసకునితో, రాణి పరిచారికల ద్వారా రాణిని రాజు కలవవలెనని ఉన్నాడని కబురు పంపెడివాడు. అంత రాణి అతనిని కలుసుకొనుటకు ఇష్ట పడినదైన రాజును ఎక్కడ, ఎప్పుడు, ఎట్లు కలవడమనేది రాజుకు రహస్య ముగా కబురు పంపేది. ఈ విధముగా అమిత ఘోషా పద్ధతి రాణివాసములో కనిపిస్తుందని పేస్ చెవుతాడు. అందుకే ఇంత పెద్ద అంతఃపురాలను రాజు నడపుటకు ఎంతైనా ధన మవసరము. ఈ ధనమంతా సామాన్య ప్రజల వద్ద నుంచి పన్నులు మూలమున రాజు వసూలు చేసేవాడు కాదు. విదేశ వ్యాపార ములో విపరీత లాభములు పొంది ఆ లాభములతో నడపేవాడు.

రాణివాసము గురించి మరో విషయము తెలుసుకోవలెను. ఆ రోజులలో రాణివాసము ఎవ్వరూ కోరేవారు కారు. అంతఃపురమునుంచి పైకి వచ్చుటకు గాని, పురుషులతో సంపర్కము పెట్టుకొనుటచు గాని వీలులేక రాణి వాసము చేయువారు ఆజన్మ బ్రహ్మచారిణులుగా ఉండిపోవలసినదే. దానికి వారు ధనము, రాజభోగముకన్న స్వేచ్ఛ ఎక్కువగా కోరుటచేతనే రాణి వాసము ఇష్టపడేవారు కాదు.

పేస్ చెప్పినదానినిబట్టి ఘోషా పద్ధతి అంతఃపురములో నున్న టువంటి వారికే కాని, సామాన్య స్త్రీలకు ఉండేదికాదని అర్థమవుతుంది. ఈ విషయాన్ని విశదీకరిస్తూ ఆ రోజులలో అనేక కథలు చెప్పేవారు. అందులో మల్లీశ్వరి కథ ఒకటి. మరొకటి, ఒకసారి రాజు ఒక-పల్లె పడుచుయొక్క అందమును చూచి ముగ్ధుడై ఆమెను వివాహమాడదలచి ఆ సంగతి తన మనుష్యుల ద్వారా ఆమెకు తెలియబఱుచుతాడు. అంత ఆ యువతి తన అయిష్టమును వారికి తెలుపుతూ రాజు కోటలో బంగరుపంజరములోని చిలుక వలె బందీగా ఉండుటకన్న, తన అంతస్తుకు తగిన వానిని వివాహ మాడి, స్వేచ్ఛగా జీవించడమే తన అభిమతమని, రాజుయొక్క మను

ష్యలతో చెప్తుంది. రాజు ఆమె అహంకారియని తలచి, ఆమెపై కోప ముతో, బలవంతముగానైనా ఆమెను పట్టి తేవలసిందిగా తన సైన్యమును పంపుతాడు. ఈ విషయము ముందే పసిగట్టిన పడుచు పక్కరాజ్యమునకు పారిపోయి అచ్చటి రాజు శరణు వేడుకొంటుంది. దీని ఫలితంగా రెండు రాజ్యాలకు యుద్ధము జరుగుతుంది. దీనినిబట్టి సామాన్య స్త్రీలు ఎంతటి స్వేచ్ఛను అనుభవించెడివారో, ఆ స్వేచ్ఛ కోసరం ఎటుల ఏ త్యాగమైనను చేయుటకు ఇష్టపడేవారో తెలుస్తుంది.

## స్త్రీలు - అలంకరణ

ఆ రోజులలో స్త్రీలు వారివారి తాహతు, కులమునుబట్టి, బట్టలు తొడుగుకొని అలంకరించు కొనెడివారు. వారి వేషాలంకరణల బట్టి వారే కులమునకు చెందినవారో చెప్పుటకు వీలయ్యేది. శుకసప్తతి, వైజయంతీ విలాసము మొదలగు గ్రంథములు ఆ కాలపు స్త్రీల వేషములను గురించి ఎక్కువగా ప్రస్తావించి యున్నవి. ఆ కాలపు ముత్తయిదువులు పసుపు పూసుకొని, కాటుక, పత్తిబొట్టు పెట్టుకొనేవారు. ధనికవర్గమునకు చెందిన స్త్రీలు పావడ, బిగువైన కంచుకము, ఖరీదైన పైట, కాళ్ళకు నాజూకైన తోలుతో చేసిన పాదరక్షలు ధరించెడివారు. వారి నగలు, వెండి బంగారముతో చేయబడి, రత్నాలు, వజ్రాలతో పొదుగబడి యుండెడివి. ఉంగరములు, హారములు ధరించెడివారు.

బ్రాహ్మణ స్త్రీలు నునుగొప్పు వేసుకొని, పసుపుబొట్టు నొసట పెట్టుకొని, కాసె పోసి చీరకట్టుకుని, చెవులకు లక్కాకులు ధరించెడివారు. బ్రాహ్మణేతర స్త్రీలు గొంటు పూసలు, రెండు గుండ్ల ముంగరలు, మైజారు చీరలు, పెనసన్న గొలుసు, పెద్ద మట్టెలు, మట్టిపిల్లాండ్లు, బొబ్బలికాయలు, కడియములు, కప్పు పల్వరుస లుంగరములు, తూలెడు కొంగులు, బలు చెంప కొప్పు లంచు కమ్మగవల్, సన్న కాటుకరేఖలు, నాభినామాదులు, నానుచుట్టు, బిగువు రవికెలు ధరించెడివారు. భోగముసాని చీర మోకాలు పైకి కట్టెడిది. లేదా మడిచారు పోసి, జారు పైటతో వింతగా కనిపించేటట్లు కట్టెడిది.

ఆ రోజులలో అనేకులు కుడి పైట, నిస్తురవిక తొడిగెడువారు. వీరందరు చాలావరకు శూద్రులు. వైజయంతీ విలాసములో కూనలమ్మ చీర గురించి చెప్పబడి యున్నది. దానికి సురవరం ప్రతాపరెడ్డిగారు ఎట్టించు గల తెల్ల చీర

అని అర్థము చెపుతూ, పిల్లలు లేని గొల్లాంగ్రడు కూనలమ్మకు (కూనలిచ్చు దేవత) ఈ చీరను నైవేద్యమిచ్చి కొలిచి, ఆ చీరను కట్టుకొనెడివారు. అందుచేత దానికి కూనలమ్మ చీర అను పేరు వచ్చినది.

జంగమ స్త్రీలు మట్టిపాలు పూసిన జడల దిండు, చింతాకంత విభూతి రేఖ, సందిట రుద్రాక్ష పూసలు, నాగబెత్తము, తామ్రపు నందిముద్ర యుంగరము, జన్నిదపు వాట ధరించెడివారు. ఎఱుకస్త్రీ పసుపురంగు రవికె తొడిగి చీర కట్టుకొని, ముంజేతులపై పచ్చబొట్టులు కలిగి, కురుమాపు పైటలో చిన్ని బుడతని కట్టుకొని, కనుబొమల సందున నామము, నొసట భూతిపూత, కనులకు కాటుక పెట్టుకొనేది.

ఈ విధంగా విజయనగర కాలములో స్త్రీలు అలంకరణలో ప్రత్యేకత చూపించెడివారు.

## స్త్రీలు - విద్య, వృత్తులు

విజయనగర సామ్రాజ్యములో అగ్రవర్ణులు, ముఖ్యముగా రాజ కుటుంబములోని స్త్రీలు, వేశ్యలు అన్ని విద్యలు చక్కగా చదువుకొని, వందితురాంద్రని పేరు గాంచినారు. సామాన్య స్త్రీలకు విద్య అందుబాటులో లేనందుననో, లేక సంసారము నడువుటకు అనవసరమనో వారు విద్య నేర్వకపోయినను, పురుషకవులతో సమానముగా కవిత్వము నల్పి, గొప్ప కవయిత్రులను పేరు గాంచిన మహిళలు ఈ కాలములోను, తంజావూరు నాయకరాజుల కాలములోను కనిపిస్తారు. వారిలో తాళ్ళపాక తిమ్మక్క, ఆతుకూరి మొల్ల, మోహనాంగి, తుక్కాదేవి, తిరుమలాంబ, రామభద్రాంబ, మధురవాణి, కృష్ణాజమ్మ, రంగాజమ్మ, ముద్దుపళని ముఖ్యులు. వీరు సంస్కృతాంధ్రములలో కవిత్వము నల్పిరి. వారిలో చాలామంది వేశ్యలు. వారు సంగీత నాట్య శాస్త్రములు కూడా నేర్చినవారు. ఆ రోజులలో ఈ రెండు లలిత కళలు ఎక్కువగా వేశ్యలే నేర్చుకొనెడివారు. బహుశః వీటిని వేశ్యల విద్యలుగా పరిగణించి ఉండవచ్చు.

కాకతీయుల కాలంలో వలెనే, ఈ కాలంలో కూడా స్త్రీలే ఎక్కువగా పూటకూళ్ళ ఇండ్లను నడిపేవారు. అందులోను బ్రాహ్మణ వితంతువులే ఈపనిని చేసేవారనీ, ఈ ఇండ్లు రాయబారములు జరుపడానికి చాలా అనువైన స్థలము

లుగా ఉండేవని, వాటిని నడుపు స్త్రీలు ఎంతో చాకచక్యముతో ఈ రాయ బారులకు సలహాల నిచ్చి, వారికి సహాయము చేసేవారని తెలియుచున్నది.

పూర్వము వలెనే బ్రాహ్మణ స్త్రీలు ఇంటిపట్టున ఉండి, ఇంటి పని చేసుకొనేవారేకాని, ఇంటినుండి బయటకు వెళ్ళేవారు కారు. కాని ఇతర వర్ణముల స్త్రీలు పొలాలకు వెళ్లి, పురుషులకు సహాయము చేసెడివారు. మధ్యాహ్నపు వేళ వారికి అన్నము పట్టుకొని వెళ్లి ఇచ్చెడివారు. ప్రత్తి పంట ఎక్కువగా ఉన్న ప్రాంతములలో స్త్రీలు తప్పక మధ్యాహ్నము వేళలయందు రాట్నము వడికే వారు. గొల్ల పడుచులు పెరుగు, పాలు, వెన్న అమ్ముకొని జీవించేవారు.

## స్త్రీలు - వివాహము

ఆ రోజులలో స్త్రీలు చాలా చిన్న వయస్సులోనే వివాహ మాడెడువారు. ఈ విషయములో పూర్వ యుగమునకు ఇప్పటికి భేదము లేదు, సామాన్య ముగా భర్త మరణానంతరము భార్య సహగమనము చేసెడిది. వితంతువులు పడరాని పాట్లు పడుటచేత సహగమనమే ఉత్తమముగా తోచి, స్త్రీలు సహగ మనమునకు ఇష్టపడేవారు. కొన్ని సందర్భాలలో బలవంతంగా ఇతరులు ఆమె చేత సహగమనము చేయించెడివారు.

పెండ్లిండ్లలో వధువుకు అరణమిచ్చెడి ఆచారము ఈ విజయనగర కాల ములో కూడా కనిపిస్తుంది. ధనికులైనవారు తమ కూతుండ్రకు అరణముగా మంచములు, పరుపులు, పళ్ళెములు, పీటలు, ఉయ్యాల మంచములు, తమ్మ పడిగములు, బిందెలు, కొప్పెరలు, తాంబూలము పెట్టెలు, రత్న మౌక్తిక స్వర్ణ భూషణములు, పట్టు బట్టలు, అగరు, కస్తూరి, జవ్వాజి, కుంకుమ పువ్వు, గంధము, పచ్చ కర్పూరము, పన్నీరు, పునుగు, అత్తరువు ఇచ్చే వారు. ఇంతే కాక వారికి సేవ చేయుటకు దాసీలను కూడా ఇచ్చి పంపేవారు. వారిని ఆడపాప లనేవారు.

## ఆతుకూరి మొల్ల

ప్రతి యుగములో శ్రేష్ఠమైనటువంటి స్త్రీలు పుట్టి దేశమునకు వన్నె తెచ్చినవారున్నారు. మన ఆంధ్రదేశములో అటువంటి వారనేకులు. ఇంతకు ముందు రుద్రాంబ, నాయకురాలు మొదలైనవారిని గురించి ప్రత్యేకముగా

తెలుసుకొనినట్లు, విజయనగర, నాయకరాజుల కాలములలో కూడా మచ్చుకు కొంతమంది ఘనత వహించిన స్త్రీలను గురించి తెలుసుకొనుట చాలా అవసరము. అప్పుడే చరిత్రలో స్త్రీ ఎంతటి ప్రధాన పాత్ర వహించినదీ తెలియగలదు. ఈ కాలములోని స్త్రీలు ఎక్కువగా సాంస్కృతిక రంగములో పేరు ప్రఖ్యాతి గాంచినవారు. అటువంటివారిలో తొలుత ఆతుకూరి మొల్ల గురించి ప్రస్తావించ దలచినాను.

తెలుగు భాషలో ప్రప్రథమముగా రామాయణము వ్రాసిన మహిళ మొల్ల. ఈమె వ్రాసిన రామాయణము ప్రసిద్ధి కెక్కినది. ఆమె కుమ్మరి కుల ములో పుట్టినది. ఆమె తండ్రి ఆతుకూరి కేసనసెట్టి. నెల్లూరు మండలమునకు చెందినవాడు.

మొల్ల ప్రబంధకాలపు మహాకవులను ఎవ్వరినీ పేర్కొనలేదు. శ్రీనాథ యుగ కవుల వరకే పేర్కొన్నది. దీనినిబట్టి ఆమె శ్రీనాథ యుగాంతమున ఉండెననియే చెప్పదగియున్నది.

మొల్ల తండ్రి శివ భక్తుడు. గురులింగ జంగమార్చన చేసెడివాడు. అటువంటి తండ్రికి పుత్రిక అగుటవలనను, గోపవరపు శ్రీకంఠ మల్లీశ్వరుని వరప్రసాదము వలనను ఆమె ఆ గ్రంథమును వ్రాయగలిగిందని అందులోనే సూచించినది.

మొల్ల రామాయణములో ఆరు కాండలు. 900 పద్యము లున్నవి. ఆమె అందులో చేసినటువంటి వర్ణనలు కంటికి కట్టినట్లుండును. యుద్ధములు జరుగుతున్నపుడు చూచి వ్రాసినదా అని అనిపించును. ఆమె దేశీయమగు తెలుగులో వ్రాసినది. స్వభావోక్తి రమణీయము లయిన ఘట్టములు, పద్యములు ఈమె కావ్యములో కోకొల్లలుగా కనిపించును. మొత్తముమీద ఉటుకూరి వారు చెప్పినట్టుగా "మొల్లకావ్యము తెనుగునకున్ రుచియై, వీనులవిందై ... కందువ మాటల సామెత లందముగా కూర్చిన, మిక్కిలి జాతీయమైన కవిత్వముతోకూడి తల్లులకు గర్వకారణగా నేటికిని మెరయుచున్నది."

## తిరుమలాంబ

విజయనగర సామ్రాజ్యమునకు వన్నె తెచ్చిన కవయిత్రులు ఒదుగురని, వారిలో తిరుమలాంబ ఒకరై అని, వారైదుగురిని కవయిత్రి పంచకమిని

చెపుతారు. మిగతా నలుగురు మొల్లమాంబ, గంగాదేవి, మోహనాంగి, తుక్కాదేవి. వారందరి గురించి వ్రాయుట కిచ్చట తావు లేనందున మొల్ల, తిరుమలాంబల గురించి మాత్రము వ్రాయగలిగాను.

కృష్ణదేవరాయల పిదప పాలించిన ఆయన తమ్ముడు అచ్యుతరాయలు భార్య తిరుమలాంబ అని కొందరు, ఆయన భోగస్త్రీ అని కొందరు చెప్పు చున్నారు. ఈమె వరదాంబికా పరిణయమను గ్రంథమును వ్రాసినది. ఇందు వరదాంబిక అచ్యుతరాయలు ధర్మపత్ని. ఆమెను గురించి చారిత్రాత్మక విశేషములు కూడా ఇందు వివరించింది. వరదాంబిక అచ్యుతరాయల భార్య. రాజ్య వ్యవహారములలో ముఖ్య పాత్ర వహించింది. వరదరాజమ్మ పేట అను ఒక పట్టణమును నిర్మించి కీర్తి పొందినది. కంచి వరదరాజస్వామి ఆలయ ములో తన భర్తతో తులాభారము తూగి భూరిదానములు చేసినది. భర్త తదనంతరము కుమారుడు రాజుకాగా అతని రాజ్యము స్థిరముగా ఉండుటకు గాను బీజపూరు సుల్తానుతో రాయబారములు జరిపినది. ఈ విధముగా తిరుమ లాంబ గ్రంథము చారిత్రాత్మక గ్రంథముగా వెలయుటయే గాక, ఈ గ్రంథము ద్వార మరో మహిళ గొప్పతనము తెలుసుకొనుటకు వీలయినది.

తిరుమలాంబ తనను గురించి ఏమి చెప్పుకున్నది తెలుసుకొన్నా ఆమె గొప్పతనము తేటతెల్లమవుతుంది. ఆమె సంస్కృతములో వ్రాసినదానిని తెలు గులో ఇట్లు వ్యాఖ్య చెప్పవచ్చు. "ఒక పర్యాయము వినగానే పద్యకావ్యముల నర్థము చేసుకొనగలది, నాటకాలంకార పురాణాగమాదులను బాగుగా నెఱింగి నది, కవి పండితులను పోషించుటయందు నిండారు కుతూహలము కలది, సరస కావ్య నిర్మాణము చేయగలది, అచ్యుతరాయల ప్రేమ సర్వ విధముల పొందినది, అనేక భాషా లిపులను చదువను వ్రాయను నేర్చినది, వీణానాదము వలె సొంపగు కంఠము కలది, భూలోక సరస్వతి యనదగినద"ని తనను గురించి తానే ఈ విధముగా వ్రాసినదానినిబట్టి తిరుమలాంబ ఏకసంథాగ్రాహి యని, సంగీత సాహిత్యములం దసమాన పాండిత్యము కలదనీ, వితరణ గుణ శాలి యనీ, పెద్దల దీవనల నందుకొన్నదనీ, తెలియుచున్నది.

## రా మ భ ద్రా ం బ

తంజావూరును పరిపాలించిన నాయక రాజులలో ముఖ్యుడైన రఘునాథ నాయకుని ఆస్థానములో ఉండిన విదుషీమణులలో అగ్ర స్థానము పొందిన కవ

యిత్రి రామభద్రాంబ. ఈమె వారాంగన యని కొందరు, భూపతి భోగస్త్రీ యని కొందరు చెప్పినా ఆమె కవయిత్రి అని మాత్రము అందరు ఒప్పుకొన్నారు.

రామభద్రాంబ సంస్కృత, ఆంధ్ర భాషలే కాక అష్ట భాషలు నేర్చి, అన్ని భాషలలోను సమస్యారూపపు పద్యములు రచించినదని చెపుతారు. ఆమె వ్రాసిన గ్రంథములలో రఘునాథాభ్యుదయము ముఖ్యము. ఇందు చోళదేశ వర్ణనము, తంజావూరు వర్ణనము, రఘునాథ నాయకుని వర్ణనము, ఆయన దినచర్య, ఆయన వంశావళి, యువరాజు, వివాహము మొదలైన అనేక చారిత్రాత్మక అంశములను గూర్చి వ్రాసినది. మరియు ఆనాటి స్త్రీ విద్య, స్త్రీల సంసారము, సంగీత విద్య, గాన నృత్య విశేషములు ఎన్నో చెప్పినవి. దీనినిబట్టి ఆమె సంగీత, నృత్య శాస్త్రములలో కూడా ప్రవీణురాలని తెలియగలదు. ఈమె సంస్కృతములో పై గ్రంథము వ్రాసినా, మిగత భాషలలో అటువంటి గ్రంథములు వ్రాయ సమర్థత గలదని చెప్పవచ్చును. ఇటువంటి మహిళను కన్న ఆంధ్ర భూమి ఎంతో పవిత్రమైనది.

## మధురవాణి

రఘునాథుని ఆస్థానము నలంకరించిన మరో గొప్ప కవయిత్రి మధురవాణి. ఆమె అసలు పేరు శుకవాణి. విద్యా వినోది యగు రఘునాథరాయలు ఆమె వాఙ్మాధుర్యమునకు మెచ్చి 'మధురవాణి' అను బిరుదు నామెకు ప్రసాదించగా ఆనాటినుండి ఆమె మధురవాణిగా వ్యవహరింపబడుచున్నది. ఆమె తల్లిదండ్రులను గురించి మనకు తెలియదు కాని, తమ విద్వత్కుటుంబమున పండిత వంశములో జన్మించినానని తన గ్రంధములో పేర్కొనినది. ఈమె సంస్కృతములో రామాయణం, కుమారసంభవము, నైషధము రచించినది.

మధురవాణి చతుర్విధ కవిత్వములందును ఆరితేరినది. అరఘడియలో వందశ్లోకములను చెప్పు కవితాధార కలదట. వ్యాకరణములో గొప్ప ప్రజ్ఞ కలదు. అవధానములుకూడా అనేకముచేస ప్రతిష్ఠ నార్జించినది. వీణావాద్యములోకూడా ప్రఖ్యాతిగాంచినది. ఆమెయొక్క అదిత్వీయ పాండిత్యమునకు ముగ్ధుడై రఘునాథుడంటివాడు ఆమెకు కనాకాభిషేకముచేసి, సత్కరించినాడట. ఇంక ఆమె ప్రజ్ఞ ఇంతయని చెప్పు కరముకారు. చరిత్రలో ఇబు

వంటి కనకాభిషేక గౌరవము ఒక రాజునుండి పొందిన ఏకైక కవయిత్రి మధురవాణి.

మధురవాణినిగురించి మరో సంఘటన చరిత్రకారులు చెపుతారు. ఇప్పుడు తంజావూరులో నున్నటువంటి సరస్వతీభవనము మధురలో ఉండెడిదట. మధురలోని పండితులను కవిత్వములో, వాదములో గెలిచి, ఆ భవనమును తంజావూరుకు తీసుకొనివచ్చినదట. ఇట్లు మధురవాణి పేరు ఆంధ్రలోకములో వన్నెకెక్కినది.

## ముద్దుపళని

దక్షిణాంధ్రయుగములో తేజరిల్లిన కవయిత్రులలో తంజాపురంలో వెలసిల్లిన శృంగార కవయిత్రులలో ముద్దుపళనికి ప్రత్యేకస్థానముకలదు. ఆమె సంగీత, సాహిత్య, నాట్యశాస్త్రములందు అద్భుతమైన పాండిత్యము సంపాదించినది. నాటికి, నేటికి ఇటువంటి శృంగార కవయిత్రి వెలయలేదు.

ముద్దుపళని తంజాపురము నేలిన మహారాష్ట్ర ప్రభువు ప్రతాపసింహుని ఆస్థానమున మధురకవితాస్రోతస్వినిని ప్రవహింపచేసి కవయిత్రీమణి. ఈమె తండ్రి పేరు ముత్యాలు. రామభక్తాగ్రగణ్యురాలు. ఈమె రచించిన గ్రంథము పేరు రాధికాసాంత్వనము. ఈమెకు శ్రీకృష్ణభగవానుడు కలలో కనపడి గ్రంథము వ్రాయమని అడిగినాడట. ఈ గ్రంథములో రాధ తానుగా, మాధవుడు ప్రతాపచక్రవర్తిగా తమ అనుభవములనే నాలుగు రెట్లు ఎక్కువగా ఇందు జోడించి వ్రాసిందనిచెపుతారు. ఇందులో శృంగారవర్ణన కొంత ముదురు పాకముననే నడచినను భాషాసౌందర్యము, తెమగు నుడికారపు సొంపులు, తేట తెనుగుమాటలు, సామెతలు, వాటికవేసాటి. ఈమె ఒకే అర్థమునిచ్చు భిన్న భిన్న పదముల నొకేపదములో వాడెడిది,

మొత్తముమీద, మొల్ల తప్ప, మిగతా ప్రఖ్యాతిగాంచిన విజయనగర, నాయకరాజులకాలమునాటి స్త్రీలు రాజాశ్రయము, రాజసంబంధము ఏదోరీతిగా కలిగినవారు. ఏమైనను వారిపేర్లు మరవరానివి. ఆంధ్రలోకమునకు వన్నె తెచ్చిన ఈ స్త్రీలు ఎప్పుడు మనచరిత్రలో స్మరణీయురాండ్రు.

## ఆధునికయుగము

బ్రిటిష్ వారు మనదేశమునకు వచ్చి, సామ్రాజ్యము స్థాపించునాటికి ఇచ్చటి సాంఘిక పరిస్థితులు చాలా అధ్వాన్నముగా ఉండినవి. వర్ణ వ్యవస్థ,

స్త్రీల దుస్థితి, అస్పృశ్యత, అనునవి బ్రిటిష్‌వారికి క్రొత్త విషయములు వారి దేశములో ఇటువంటి వాటికి తావు లేదు. అచ్చట మతమునకు సాంఘికాచారములకు ఎటువంటి సంబంధము లేదు. స్త్రీలు పురుషులతో బాటు విద్య నేర్చుకొని, ఉద్యోగములు చేసెడివారు. స్త్రీలపై పురుషులకు ఎంతో గౌరవము. అటువంటివారికి మన దేశమునకు రాగానే ఇచ్చట స్త్రీల పరిస్థితి వారికి బాధ కలిగించినది.

వారు వచ్చునాటికి సతీసహగమనము, ఆడశిశువుల హత్య, పరదాలేక ఘోషాపద్ధతి, బాల్యవివాహములు దేశములో ఆచారమైపోయినవి. ఇవన్ని స్త్రీలకు సంబంధించిన ఆచారములు. మొదట్లో పరిస్థితుల ప్రభావము ఇటువంటి పద్ధతులకు దారితీసినప్పటికీ, కాలక్రమేణా ఇవి మూఢాచారములుగా మారిపోయినవి. తల్లిదండ్రులు, తమ ఆడపిల్లలకు తగిన రక్షణ ఇచ్చుటకుగాను అతిబాల్యముననే వారికి వివాహముచేసెడివారు. కోడలు బాధ్యత అప్పటినుండి వహించవలసిన ఉన్నందున అత్తమామలు ఆమె తల్లిదండ్రులవద్దనుండి విపరీతముగా కట్నము తీసుకొనెడివారు ఈ కట్నము ఇచ్చుకొనలేక అనేక కుటుంబములు చితికిపోయేవి. కొన్ని సందర్భములలో ఎక్కువ కట్నము ఇచ్చుకొనలేని తల్లిదండ్రులు తమ ఆడపిల్లలను రెండవ పెండ్లివానికో, వయస్సుమళ్లిన మూడోపెళ్లి వానికోకూడా పెండ్లి చేసేవారు. ఈ వివాహమైన ఆడపిల్లలు చిన్న వయస్సులోనే సంసారబాధ్యత వహించవలసి ఉండినందున వారికి విద్యనేర్చుకొనే అవకాశముగానీ, ఆసక్తిగానీ ఉండేదికాదు. సాంసారిక స్త్రీలలో ఏ కొద్ది తప్ప ఎవ్వరికీ చదువనూ, వ్రాయనూ వచ్చేదికాదు. పురుషులు ఏమి చెప్పినను 'విస్సన్న చెప్పిందే వేద'మని వారు చెప్పినవి గుడ్డిగా నమ్మెడివారు. పురుషులుకూడా దీనిని ఆస్కారముగా తీసుకొని, స్త్రీలను ప్రతి చిన్న విషయమునకూ కఠినముగా శిక్షించేవారు.

ఆంగ్లేయులకు ఈ ఆచారములన్నియు మూఢాచారములుగా కనిపించినవి. అందుకని వారు ఆంగ్ల విద్యను దేశములో ప్రవేశపెట్టినట్లైన వారిలో మార్పు రావచ్చునని భావించి, ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టినారు. మనవారు కొంతమంది ఆంగ్లవిద్యను నేర్చుకొనుటచేత విదేశములలో ప్రజలు స్వతంత్రముకొరకు ఏవిధముగా పాటుపడెడివారో, అచ్చట సంఘము ఎంత చక్కగా పురోగమించిందో తెలుసుకున్నారు. దీనికి కారణము కొంతవరకు

గృహిణి అయిన స్త్రీ అని వారు విశ్వసించారు. ఎందుకనగా ఆమె చదువుకుని, తన పిల్లలకు విజ్ఞానము అందిస్తుంది. కనుక మనదేశములోకూడా గృహిణి విజ్ఞానవంతురాలయిన, ఆమె ఎక్కువకాలము పిల్లలతో గడుపుతుంది కాబటి ఆమె సంతానమునకుకూడా విజ్ఞానము కలుగుతుందని నమ్మినారు. సంఘసంస్కరణకు పూనుకొనినారు.

సంఘసంస్కర్తలలో 19వ శతాబ్దపు మొదటిభాగంలో ప్రముఖ పాత్రను వహించినవాడు రాజారామమోహనరాయలు. ఆయన బ్రిటిష్ వారి సహాయముతో కొత్త ఉద్యమమును లేవదీసినాడు. ఒక నూతన సమాజమును స్థాపించినాడు. దానికే బ్రహ్మసమాజమని పేరు ఈ సమాజసిద్ధాంతముల కనుగుణముగా రాజారామమోహనరాయలకు సమకాలికుడయిన బెంటింగు ప్రభువు సతీసహగమనము నిషేధిస్తూ శాసనమొకటిచేసినాడు. అంతకు పూర్వము కూడా 1812, 1815, 1817 సంవత్సరాలలో ప్రభుత్వము సహగమనాన్ని కొన్ని సందర్భాలలో నిషేధిందించింది. లేతవయస్సులో ఉన్న స్త్రీలకు, గర్భిణీ స్త్రీలకు, పసిపిల్లలుగల స్త్రీలకు సహగమనము చేసుకొనుటకు హక్కు నిషేధింపబడినది. ఈ శాసనమువల్ల, బెంటింకుశాసనమువల్ల కొంతవరకు ఈ దురాచారమును మాన్పించడం జరిగింది.

ఆంధ్రదేశంలో అనేకులు బ్రహ్మసమాజములో చేరినారు. ఆ ధర్మముల పట్ల ఆకర్షితులయినారు. అటువంటివారిలో ముఖ్యుడు మన్నవ బుచ్చయ పంతులు. ఆయన మద్రాసులో ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చేసెడివారు ఆ పాఠశాల బాలికల పాఠశాలయని, బుచ్చయ్యపంతులే దానిని స్థాపించారని చెపుతారు.

బుచ్చయ్యపంతులుగారి ప్రియశిష్యుడైన వెంకటరత్నంనాయుడు బ్రహ్మసమాజమునకు మరింతపాటుపడినారు. క్రీ. శ. 1881లో అనేకుల పెద్దల సమక్షములో ఆయన రాజమహేంద్రవరములో రెండు వితంతు వివాహములను జరిపినాడు. అప్పటినుండి ఇతరులుకూడా ధైర్యముగా వితంతు వివాహములను చేయసాగనారు. ఆ పట్టణములోనే ఆయన వితంతు శరణాలయమును స్థాపించి దానికి ముప్పదివేల రూపాయల విరాళమునుకూడా ఇచ్చినాడు. ఆయనను గురించి ఒక సమకాలికుడు ఇట్లు చెప్పినాడు. "ఆయన జీవితము భక్తిరస

సింధువు; పతితులకు నావ; అనాథులకు పట్టుకొమ్మ; భక్తులకు అమర గానము."

నాయుడుగారిలాగానే స్త్రీజనోద్ధరణకు పనిచేసిన వేరొక సంఘసంస్కర్త, ఈయన సమకాలికుడగు, కందుకూరువీరేశలింగంపంతులు. ఆంధ్రదేశంలో స్త్రీలకై పాటుపడినవారిలో ఈయన పేరు సువర్ణాక్షరములతో వ్రాయవచ్చును. ఈయన వివేకవర్ధని అను పత్రికను స్థాపించి, సాంఘిక దురాచారములను అందులో పేర్కొని, వాటివల్ల దేశమునకు ఎంత నష్టము కలుగుతున్నదో నిరూపించి వాడు తెలుగులో స్త్రీలనుగురించి అనేక గ్రంథములను వ్రాసినారు. వారి కృషి ఫలితముగా ఆకాలములో నున్నటువంటి దురాచారములు అదృశ్యమైనవి. వాటిలో ముఖ్యమైనవి భోగము మేళము, అతిబాల్యవివాహములు, కన్యా శుల్కము, స్త్రీల నిర్బంధవైధవ్యము, స్త్రీలను పాఠశాలలకు పంపకుండుట, వీరు స్త్రీలకుచేసిన సేవ వివరముగా తెలుసుకొనుట అవసరము.

## స్త్రీ విద్య

వీరేశలింగం పంతులుగారు స్త్రీ విద్యకై అపార కృషిచేసినారు. ఆయన "స్త్రీలపరిస్థితి బాగుపడినగాని దేశ పరిస్థితి బాగుపడదని నా నమ్మకము...గృహము మహారణ్యసదృశము గాక భూతల స్వర్గమువలె నుండగోరినయెడల పురుషులు గృహిణులను విద్యావంతులుగాచేసి జ్ఞానదీపప్రభావముచేత నజ్ఞాన తిమిరము తొలగించి దుర్గుణ దురాచార సర్పశార్దూల సంచారములకు నారీహృదయ కుహరములయందు చోటులేకుండ చేయవలె"నని తన అభిప్రాయము వెలిబుచ్చినారు.

పంతులుగారు స్త్రీకివిద్య అవసరమని ప్రచారముచేయుటయేగాక దానిని ఆచరణలోకూడా పెట్టిరి. వీరు స్త్రీల కొఱకు అనేక పాఠశాలలను స్థాపించిరి. స్త్రీలే ఉపాధ్యాయినులుగా ఉన్నయెడల వయస్సువచ్చిన పిల్లలుకూడా పైతరగతులలో చదువడానికి వీలవుతుందని ఆ ఏర్పాటుకూడాచేసినారు. సంసారముచేయుచు గృహకృత్యములను చక్కబెట్టుకొనవలసిన స్త్రీలుకూడా విద్య నేర్చుకొనుటకు వీలుగా ప్రత్యేక వేళలందు విద్య నేర్చుకొను అవకాశము కల్పించినారు. పురుషులు, స్త్రీలు కలసి చదువుకొన్నట్లైన, స్త్రీలను గౌరవించడానికి పురుషులకు తెలియగలదని 'హితకారిణి' సమాజవు పాఠశాలను

స్థాపించి, అందు స్త్రీపురుషులిరువురుచేరి చదువు సదుపాయము కల్పించినారు. పంతులుగారు స్త్రీలకుపయోగపడు గ్రంథములనుకూడా అనేకము వ్రాసినారని ఇదివరకే చెప్పియున్నాము. ఈ విధముగా వారు స్త్రీవిద్యకై ఎంతో కృషి చేసినారు.

## అతి బాల్య వివాహములు

వీరేశలింగం పంతులుగారిని బాధించిన మరో దురాచారము అతి బాల్య వివాహములు. 20 వ శతాబ్ద ప్రారంభ కాలానికే బ్రిటిషు వారి ధర్మమా అని సతీ సహగమనము చాలావరకు పోయినదనియే చెప్పవచ్చును. కాని, ముఖ్యముగా అగ్ర వర్ణముల వారిలో అతి బాల్య వివాహము సర్వ సాధారణమైపోయినది. పది సంవత్సరములు దాటిన అవివాహిత స్త్రీలు ఆ రోజులలో ఎక్కువ కనిపించరు. మూడు నాలుగు సంవత్సరాల వయస్సులోనే ఆడపిల్లలకు వివాహము జరిగేది. ఈ విధముగా వివాహములు జరుగుట అనేక అనర్థములకు దారి తీసెడిది. వీటిలో కొన్ని ఏమనగా లక్షలాది ఆడపిల్లలు బాల్యమునందే విధవలై ఆజన్మ పర్యంతము నిర్బంధ వైధవ్యము ననుభవించుచుండిరి. ఇంత చిన్నవయస్సులో వివాహము జరుగుట మూలమునవారు పాఠశాలలకుపోవుటకు వీలయ్యేది కాదు. అందుచేత వారు విద్యావిహీనలుగా ఉండేవారు. వారికి సంతానము అతి పిన్నవయస్సులో కలుగుట మూలమున అకాలమున కాచిన కాయలవలె ఆ పిల్లలు అతి బలహీనముగను, రోగపీడితులుగను ఉండేవారు. "పిన్న ఈడుకో నున్న తల్లులకు దేహ దౌర్బల్యము కలుగుటయు, వయస్సులోనే ముసలితనము వచ్చుటయు, అల్పాయుష్మంతురాం డ్రగుటయు సంభవించు చున్నదని" ఆయన చెప్పినారు. అతి బాల్య వివాహములు శాస్త్ర సమ్మతము కావని గూడా ఆయన ఋజువు చేసినారు. దీని ఫలితముగా కాలక్రమేణ ఈ దురాచార మడుగంటెను.

అతి బాల్య వివాహములతో బాటు మరో దురాచారము దానికి ముడిపడియుండెను. అదియే కన్యాశుల్కము. ఆ రోజులలో వరకట్నా లివ్వలేని తల్లిదండ్రులు తమ ఆడపిల్లలకు వివాహము చేయుట పెద్ద సమస్యగా ఉండెడిది. కాని, భార్యా విహీనులైన అతి వృద్ధులు, కాటికి కాలు జాచుకొను కడు ముసలివారు ఎంతమందో తిరిగి వివాహమాడుటకు సంసిద్ధులుగా ఉండిరి. భార్య

ఉండగా మరణించినవారికి స్వర్గసుఖము లభిస్తుందనో, మరే కారణము వల్లనో వారు వివాహముచేసికొనుటకు సంసిద్ధులుగా ఉండేవారు. అందుకుగాను వారు ఆడపిల్లల తండ్రులకు శుల్కము నిచ్చి వారి పిల్లలను వివాహమాడెడి వారు. దానివలన తమ పిల్ల కన్నె చెర విడిపించటానికి వీలవుతుందనే స్వార్థముతో వారు పరదేశ్వదైనను ఎక్కువ శుల్కము ఇచ్చువానికి తమ ఆడపిల్లలను వివాహము చేసెడివారు. ఈ దురలవాటును పంతులుగారు సహించలేక బహిరంగముగా ప్రసంగిస్తూ "భూతదయను ముఖ్యముగా పాటించు వారమన్న ప్రతిష వహించిన హిందువులమయిన మనము మన దేశమున బుట్టిన నిరపరాధినులైన ముద్దు బాలికలను నిర్దాక్షిణ్యముతో, ధనాశా భూతావేశమతులై ఉన్న పిశాచ రూపధారులగు ఘోర రాక్షసులు పనికిమాలిన వారికి విక్రయించెడి దురాచారము" నిర్మూలించ వలెనని చెప్పినారు. ఈయన ప్రచారము వలనను, ఈయన శిష్యుల ప్రచారము వలనను చాలావరకు మనదేశములో, ముఖ్యముగా మన ఆంధ్ర దేశములో, బాల్య వివాహ దురాచారము నిర్మూలన మయినదనియే చెప్పవచ్చును.

## స్త్రీ పునర్వివాహము

ఆంధ్ర దేశములో ఇరవయ్యో శతాబ్దములో అనేక సంఘ సంస్కర్తలు ఎక్కువగా స్త్రీ పునర్వివాహమునకై పాటుపడిరి. వారిలో వీరేశలింగం పంతులుగారు ఈ సమస్య పరిష్కారమునకు పాటుపడినట్లు మరి ఏ సమస్యకు పాటుపడలేదనే చెప్పవచ్చు. ఆయనకు పూర్వమునుండి అనేకులను ఈ విషయము కలవర పెట్టినది. దీనికి కారణము విధవ స్త్రీలు ఎంత చిన్నవారైనను బొట్టు పెట్టుకొనగూడదు, శుభ్రమైన దుస్తులు, రంగురంగుల దుస్తులు వేసుకొనగూడదు. నగలు పువ్వులు వారికి నిషేధము. జ్ఞానము తెలియని వయస్సులోనే విధవలైన బాలికల కిది ఒక నరకము.

పంతులుగారికి పూర్వమే సామినేని ముద్దు నరసింహ నాయనివారు అను ఒక సంఘ సంస్కర్త తమ "హితసూచని" లో ఈ మూఢాచారమును ఈవిధముగా విమర్శించినారు. "బాలికకు అక్కరబట్టని పెండ్లి" యనగా చిన్నతనములోనే వివాహము, చేసి గర్భాదానము కాకమునుపే ఆ పెండ్లి కుమారుడు చనిపోతే, ఆ పిల్లకు తిరిగి పెండ్లి చేయక, ఆ చిన్నది, ఆవిడయొక్క యౌవ

నము దుఃఖముతోనే వెళ్ళబుచ్చు కొనేలాగు కనిపెట్టడమునకు బాధ్యత గలవా డయ్యే తండ్రి ఎంత పాపమును, ఎంత దుఃఖమును పొందవలసి ఉన్నదో వివేకశాలు లయినవారు యోచించ వలసినది...పునర్వివాహములు రద్దుపరచి నందుచేత నిర్బంధమును పొందిన స్త్రీలలో చాలమందిచేత అనేకము లైన అకృత్యములు జరిగించబడి, వాటిని బట్టి వచ్చే దురాచార సంబం ధములను, దుర్దోషములను, ఉపద్రవములను ఆయా కుటుంబముల వారు పొందడమునకు హేతువులు కలుగుతున్నవి...సుఖమున్ను, సంతోషమున్ను వివాహసితినిన్ని పొందే హక్కు భగవంతుడు స్త్రీపురుష జాతులకు సమానము గనే కలుగజేసియున్నాడు గనుక తప్పిదము లేనిది అటువంటి హక్కుల నుంచి స్త్రీ జాతిలో కొందరిని తప్పించడమునకు ఎవ్వరికిన్ని న్యాయము ఉన్నట్లు ఎంచే వల్లలేదు..." ఈ విధముగా నరసింహనాయనివారు ప్రబోధిం చడమే కాకుండా ఏదేని కారణమువలన సంఘములో లోపభూయిష్టములైన ఆచారములు ఉన్నట్లైన వాటిని నిర్మూలము చేయుట బుద్ధిమంతుల లక్షణమని చెప్పినారు. ఈ విధముగా ఆ కాలపు స్త్రీల పరిస్థితి ఉండినది.

పంతులుగారు కూడా ఈ పునర్వివాహ సమస్యపై ఎక్కువ దృష్టి పెట్టినారని ఇదివరకే చెప్పినాము. ఆయన ఉపన్యాసముల రూపములో ఒక ఉపన్యాసముల సంపుటి తయారు చేసి, అందులో ఒక ఉపన్యాసములో వైధవ్య మనుభవించు స్త్రీలను గురించి ఇట్లు వ్రాసినారు. "నిర్బంధ వైధ వ్యము వంటి క్రూర దురాచారము మరియొకటి లేదు...అనేకులు అతి బాల్య మందే ఇట్టి నిర్బంధ వైధవ్యము ననుభవించుచున్నారు. సుఖపడవలసిన స్త్రీలు దుఃఖముల పాలగుట భగవదిచ్ఛకు విరుద్ధము. నిర్బంధ వైధవ్యము వ్యభి చారమునకును, భ్రూణ హత్యలకును దారి తీయును. నొసటలోని కుంకుమ బొట్టును పొయిలోని బూడిద బొట్టుగాను, చేతులకు బంగారు కంకణములు రాగి పట్టెలుగాను, మెడలోని ముత్యాల హారములు తులసి పూసల పేరులు గాను, సరిగ పట్టు చీరలు అంచులేని పనికిమాలిన ముడిగుడ్డలుగాను, మెత్తని పరుపులు కటిక నేలను తాటిచాపలుగాను మారుటకంటె క్రూరమైన ఆచార ముండునా ? చిన్నప్పటినుండియు చమురు రాచి పెంచుకొని నిత్యమును దువ్వుకొనుచు పువ్వులు ముడుచుకొనుచు ప్రాణముతో సమానముగా చూచు కొనుచున్న తలవెండ్రుకలను మంగలివాని కత్తుల కప్పగించుటకంటె మాన

వతుల కొక్కసారిగా తల కొట్టివేయుట ఉత్తమముగా తోచదా ?" ఈ విధముగా ఆయన వైధవ్యమును వహించిన స్త్రీల పాట్లను మనస్సును ద్రవింపచేసినట్లు చెప్పి అనేకమందిలో గొప్ప పరివర్తనము కలిగించిరి. వారిలో అనేకులను స్త్రీ పునర్వివాహమునకు సుముఖులుగా చేయగలిగినారు. స్మృతులు కూడా ఇట్టి వివాహములు సమ్మతించినవని కూడా చెప్పినారు.

ఈ విధముగా ఉపన్యాసములతో వ్యాసములతో ఆయన తృప్తి పడలేదు. సహజమైన కార్యదీక్షతో ఆయన అనేకమంది బాల వితంతువులకు తగిన వరులను సమకూర్చి వివాహములను చేసినారు. సంఘము అటువంటి వారిని బహిష్కరించిన వారికి కావలసిన సహాయము చేసినారు. ఇట్లు పంతులుగారి కృషివలన కాలక్రమమున వితంతువుల అగచాట్లు తగ్గిపోయి, వితంతు వివాహములు సర్వ సాధారణమైనవి.

## వేశ్యా వృత్తి

అనాదిగా మన దేశములో ఈ వేశ్యావృత్తి వస్తున్నట్లు మనము తెలుసుకొన్నాము. వీరేశలింగం పంతులుగారు ఈ వృత్తిని ఖండించిరి.

ఈ వృత్తి నశించిన ఎడల సంగీత విద్య, నాట్య విద్య నశించునని వేశ్యా వృత్తిని సమర్థించు వారి అభిప్రాయమును వాదనను పంతులు గారు ఖండించి దానికి ఇట్లు బదులు చెప్పినారు. "ఈ ఉత్తమమైన విద్యలు ఎంత కాలమైతే ఈ వారాంగనలు సొత్తు అగునో అంతకాలము కులకాంతలు వాటిని నేర్చుకొనుటకు ఇష్టపడరు. ఆ విద్యలు నేర్చుకొనుట గౌరవహీనమని తలచెదరు." ప్రాచీనకాలమునుండి ఈ విద్యలు అందరూ నేర్చేవారని, వేశ్యలకుమాత్రం నిర్దిష్టమయినవికాదనిచెపుతూ వేశ్యలు తమవృత్తినిమాని సామాన్యస్త్రీలవలె మెలగుట ఉత్తమమనికూడా ఆయన చెప్పినారు. ఆయన కృషి మూలముగాను, ఇతర సంఘ సంస్కర్తల కృషి ఫలితముగాను పెండ్లిండ్లలో వ్యర్థవ్యయమునకు దోహదమిచ్చినట్టి భోగము మేళములు అడుగంటెను. ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు స్త్రీలకు అపారమైన సేవచేసినారు.

పంతులుగారువలెనే ఆయన సమకాలికులైన గురజాడ అప్పారావుగారు తన కలముద్వారా, నాటకములద్వారా స్త్రీలపరిస్థితిని బాగుచేయుటకు పూను

కొనినారు. ఆయన వ్రాసినటువంటి పుస్తకములలో కన్యాశుల్కము చాలా గొప్పది. ఈ నాటికికూడా ఆ పుస్తకము పేరు ప్రఖ్యాతిగాంచి ఉన్నది. ఈ గ్రంథములో ఆయన వేశ్యల మర్మములు, వేశ్యాలోలురైన పురుషులుచేయు అత్యాచారములు, పడుపాట్లు, వైధవ్యమును వహించిన అతి బాల్యస్త్రీల కష్టములు, 'నాచ్' గురించి ఆయన అభిప్రాయములు అందులో కనుపించడమే గాక, విధవా పునర్వివాహము ఆయన సమర్థించినారు. ఆ విధముగా పునర్వివాహము చేసుకోని వయస్సులోని స్త్రీలు ఏవిధముగా కులటలు కావడానికి వీలున్నదీ పేర్కొన్నారు. అట్లే 'నాచ్'ని ఖండించి, వేశ్యలలో పరివర్తన వచ్చుటకు వీలున్నదని నిరూపించినారు.

ఈవిధముగా పందొమ్మిదవ శతాబ్దపు ఆఖరిభాగంలో ఇరవయ్యో శతాబ్దపు మొదటిభాగములో ఆంధ్రదేశములో అనేక సంఘసంస్కర్తలు స్త్రీల పునరుద్ధరణకు పాటుపడినారు. దీనివల్ల ఒకప్రక్క స్త్రీలకు ఉపకారము జరుగుటయేగాక, మన స్వాతంత్ర్య సమరములో గాంధీజీ పిలుపుతో స్త్రీలు పాలు పంచుకోవడానికి వీలయినది. అందువలననే ఈ సంఘ సంస్కర్తలు, ముఖ్యముగా వీరేశలింగంపంతులుగారు చిరస్మరణీయులు. ఆంధ్రదేశ స్త్రీలచరిత్రలో వారిపేరు సువర్ణాక్షరములతో వ్రాయవలెను. పంతులుగారు ఆంధ్రదేశ స్త్రీల పునరుద్ధరణకు చేసిన సేవను వ్రాయుటకు కొన్నివందల పేజీల గ్రంథము వ్రాసినను చాలదు. కాబట్టి ఇచ్చట అతిముఖ్యమైన అంశములను బహు టూకీగా వ్రాయగలిగాను. అందుకే ఈ యుగమునకు వీరేశలింగయుగమని చెప్ప వచ్చును.

ఆంధ్రదేశములో స్త్రీలపరిస్థితిని మెరుగుపరచుటకు ఒకప్రక్క ప్రయత్నములు జరుగగా, అటువంటి సదవకాశమును వినియోగించుకొని పేరు ప్రఖ్యాతులు సంపాదించిన స్త్రీలుకూడా ఈకాలములో కనిపిస్తున్నారు. వారిలో విద్యనేర్చి కవిత్వము నల్లిన మహిళలు కనిపిస్తున్నారు. కొంతమంది స్త్రీలు పత్రికలు నడుపు ప్రజ్ఞావంతులయినారు. శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారు 'హిందూసుందరి', పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు 'సావిత్రి', వింజమూరి వెంకటరత్నమ్మగారు 'అనసూయ' పత్రికలు నడిపినారు.

ఈ వీరేశలింగం యుగములో పేరుగాంచిన మహిళలలో పైన పేర్కొన్నవారు కాక అనేకులున్నారు. కొంటికలపూడి సీతమ్మగారు, బండారు అచ్చమాంబ, రాణీ చిన్నమాంబ, కందుకూరి రాజ్యలక్ష్మమ్మ మొదలయిన వారు వారిలో కొందరు. వీరేశలింగంగారికి కొంచెము పూర్వము, మంచి పేరు ప్రఖ్యాతిగాంచిన తరిగొండ వెంకమాంబగారిని కూడా తప్పక జ్ఞప్తియం దుంచు కొనవలెను. వారిని గురించి, వారి జీవిత విశేషములను గురించి కొంచెము తెలుసుకొనుట ఎంతో అవసరము. తెలుసుకొన్న వారి జీవితము కూడా సార్థక మవుతుంది.

## తరిగొండ వెంకమాంబ

వెంకమాంబ 19 వ శతాబ్దపు మధ్య భాగములో జీవించినదని చెపు తారు. ఈమె కడప మండలంలోని తరిగొండ వాస్తవ్యురాలు. ఈమె తండ్రి కానాలి కృష్ణార్యుడు. తల్లి మంగమాంబ. ఆనాటి సాంఘిక పరిస్థితులలో కుల స్త్రీలు విద్య నేర్చుటకు అవకాశములేని సమయములో వెంకమాంబ తెలుగు వాఙ్మయములో అపూర్వ జ్ఞానము కలిగి, ఆ భాషలో అనేక తాత్విక గ్రంథ ములు రచించెను.

తరిగొండ వెంకమాంబ ఆమె తండ్రికి వరప్రసాదిని. ఆమె తండ్రికి పిల్లలులేమి కనబడిన దేవతలకెల్ల మ్రొక్కి చివరకు వేంకటేశ్వరస్వామికి మ్రొక్కుకున్నాడు. ఆయన వర ఫలితమేమో వెంకమాంబ పుట్టినది. ఆమెకు స్వామి పేరే నామకరణము చేసినారు. తండ్రికి ఆమె గారాబు బిడ్డ. తండ్రి ఆమెకు చిన్ననాటినుండి అన్ని విద్యలు నేర్పినాడు. 7, 8 సంవత్సరాల వయస్సుకే ఆమె ఎంతో చదువ నేర్చుకొనుటయే కాక, తత్ఫలితముగా ఆమెకు ఆధ్యాత్మిక చింతన వెలువడింది. ఒళ్లు మరచి కృష్ణ నామ స్మరణ చేయుచు పరమ భక్తురాలుగా మారిపోయినది. ఆమె విరాగిని అగునేమో యని తండ్రి ఆమెకు లౌకిక విద్యలు నేర్పినను ఆమె తన పట్టును మానలేదు. తండ్రి ఆమెను శతవిధముల బెదిరించినాడు. కాని ఆమెకు కృష్ణ ధ్యాస తప్ప మరే ధ్యాస లేకుండినది. ఇట్లు కాదని తండ్రి ఆమెకు విద్యలు చెప్పించుట మాన్పించినాడు, హింసించిచాడు. ఎప్పుడయితే గ్రంథములు చదువ నవకాశము లేకపోయినదో, సహజముగ సంగీత జ్ఞానము

కలిగిన ఆమె కంఠమెత్తి కృష్ణుని సంకీర్తనము చేయసాగినది. తండ్రి కుపి తుడై నోటికి వాతలు పెట్టినాడు. కాని, అవి ఏమియు ఆమెలో మార్పు తేలేదు. వివాహము చేసిన ఆమె మారునేమో యని ఆమెకు వివాహేచ్ఛ లేక పోయినను, ఒక మంచివానిని చూచి బలవంతముగా ఆమెకు వివాహము చేసి నాడు. భర్త రాగానే ఆమె ఆతనిని భయపెట్టినది. ఆ భయానికి ఆతను ఆరు మాసములలో మరణించినాడు. ఈ విధముగా ఆమె బాల వితంతు వయినది.

ఆ రోజులలో బాల వితంతువుల పాట్లు మన మెరిగినదే. వయస్సు రాగానే ఆమెకు కేశఖండన చేయవలెనని సంఘము పట్టుబట్టగా ఆమె దాని కియ్యకొనలేదు. అంత అచ్చటివారు ఆమెకు బలవంతంగా కేశములను తీయిం చిరి. ఆమె వెంటనే వెంకటాచలపతిని వేడుకొని కోనేటిలో మునిగినది. ఆమెకు పోయిన కేశములు తిరిగి వచ్చినవట. అప్పటినుండి ఆమె మహిమ కలదని ఆమె దగ్గరకు పోవుటకు భయపడేవారట.

అంత మాత్రముచేత ఆమె బాధలు అంతము కాలేదు. ఆ ఊరులోని అల్లరిమూక ఆమెను హింసించడానికి పూనుకొన్నది. ఆమె భక్తి బూటకమని ప్రచారము చేసి, ఆమెకు నిలవనీడలేకుండా చేసినారు. ఈ బాధలు తాళలేక ఆమె తన గ్రామమును వదలి తిరుపతిచేరి తన జీవితశేషమును స్వామిసన్ని ధిని గడిపినది. ఆమె తన ఎనుబదవయేట మరణించినది.

వెంకమాంబ వెంకటావలపతియే తనపతిగా ఎంచి, ఆయనమీద అనేక కీర్తనలు రచించినది. వాటిలో నలుగు పాటలు, సింగారింపు పాటలు, బువ్వం బంతి పాటలు, అలకతీరు పాటలు, ఆరగింపు పాటలు, పవ్వళింపు పాటలు, హారతి పాటలు ముఖ్యమైనవి.

ఇవిగాక ఆమె అనేక రచనలను చేసినది. ఆమె రచనలలో కడపటి దైన ద్విపదభాగవతములో ఆమె వ్రాసిన గ్రంథముల పట్టికయున్నది అవి ఏమనగా, నరసింహ శతకము, నరసింహ విలాస కథ, శివ నాటకము, పారి జాతాపహరణము, రమా పరిణయము, చెంచు నాటకమను ఒక కథ, కృష్ణ

* ఈ కోవకే చెందినవారు తెలంగాణములోని రాణి శంకరమ్మ(వనపర్తి) గద్వాల ఆదిలక్ష్మమ్మ, రావిచెట్టు లక్ష్మినరసమ్మ.

మంజరి అను ద్విపద, శ్రీ రుక్మిణి నాటకము, గోపికా నాటకము, భాగవతము. క్రమశిక్షణ ఆమెకు లేనందున ఆమె పై రచనలన్ని దైవమహిమ వల్లనే వ్రాసియుండనోపు. ఈ విధముగా ఈమె బహు గ్రంథకర్త్రి. అందులోను ద్విపద, యక్షగానము, శతకము, కావ్యము, నాటకము, ప్రబంధము, పాట అను వివిధ ప్రక్రియలలో బహుళ సంఖ్యాక గ్రంథములు రచించిన స్త్రీ ఇంతవరకు ఈమె తప్ప మరెవ్వరు కనిపించరు. ఆంధ్ర వనితాలోకం గర్వించదగ్గ గొప్ప మహిళ తరిగొండ వెంకమాంబ.

## భండారు అచ్చమాంబ

తరిగొండ వెంకమాంబ తరవాత చాలాకాలము వరకు వన్నె కెక్కిన ఆంధ్ర నారీరత్నములు మనకు కనబడరు. కాని వీరేశలింగంపంతులు ధర్మమా అని 20 వ శతాబ్దారంభమునుండి తిరిగి ప్రసిద్ధి వహించిన మహిళలు కనిపిస్తున్నారు. ఈ మహిళలకు అంతకు పూర్వము మనము పరిచయము చేసుకొన్న మహిళలకు ఒక భేదమున్నది. ఇంతవరకు మనము తెలుసుకొన్న స్త్రీలు ఆధ్యాత్మిక చింత కలవారుగా ఉండి, వారి రచనలు, చేష్టలు వాటికి సంబంధించి ఉండేవి. వారు లౌకిక విషయములలో ఎక్కువ ఆసక్తి చూపినవారు కారు. కాని, మనము చదువబోయే ఈతరపు మహిళలు లౌకిక విషయములలో గూడా ఎక్కువ శ్రద్ధ వహించినారు. స్త్రీ విద్యకొరకు, స్త్రీ సంక్షేమముకొరకు ఎంతో పాటు పడినారు. వారి సేవాదీక్ష వలన మన స్వాతంత్ర్యోద్యమములో అనేక స్త్రీలు ముఖ్య పాత్ర వహించుట జరిగింది. అటువంటి స్త్రీలలో భండారు అచ్చమాంబ ఒకరు.

భండారు అచ్చమాంబ క్రీ. శ. 1874 లో కృష్ణా జిల్లా నందిగామ గ్రామంలో జన్మించినది. ఆమె తండ్రి కొమర్రాజు వెంకటప్పయ్య, సోదరుడు ప్రఖ్యాత చరిత్రకారుడు వెంకటలక్ష్మణరావు. ఈమె తన మేనమామ అయిన భండారు మాధవరావును వివాహమాడి, అనేక సంవత్సరములు మధ్య పరగణాలలో గడిపినది. ఆమె చిన్నతనంలోనే తన తమ్ముని సహాయంతో విద్యనభ్యసించినది. ఆటు తరువాత స్వయంకృషితో శాస్త్రములను, శ్రుతి స్మృతులను అరము చేసుకొను జ్ఞానము సంపాదించినది. ఆమెకు ఆంగ్లము, మరాఠీ భాషలు గూడా చక్కగా వచ్చును,

అచ్చమాంబకు లక్ష్మణరావుగారి వలెనే చరిత్ర రచనలో ఆసక్తి ఎక్కువ. ఆమె అబలా సచ్చరిత్ర రత్నమాల యను చారిత్రాత్మక కృతి నొకదానిని వ్రాసెను ఇందులో మూడు భాగములున్నవి. మొదటి భాగములో పౌరాణిక స్త్రీలచరిత్ర, రెండవ భాగములో చారిత్రక స్త్రీలచరిత్ర, మూడవ భాగములో ఆంగ్లేయాది విదేశ స్త్రీల చరిత్ర చెప్పబడియున్నది. ఇవి కాక ఆమె ఒక శతకముగూడా వ్రాసినదట; కాని అది లభ్యము కాలేదు.

ఈమె వ్రాసిన అంశములు, విశేషములు, విషయము లన్నియు ప్రమాణ పూర్వకముగా వ్రాసినట్టివి. అందుకే ఆమె ఏమి వ్రాసినను నూటికి నూరు పాళ్ళు సత్యమని తెలియగలదు.

భండారు అచ్చమాంబ మహిళాభ్యుదయమున కెంతో పాటుపడినది. మహిళల నుద్దేశించి వారికి సంబంధించిన విషయములపై అనేక ఉపన్యాసముల నిచ్చి, పత్రికలకు వ్యాసములు వ్రాసి, అనేక మహిళా సమాజములను స్థాపించి మహోద్ధరణకు సేవ చేసినది.

అచ్చమాంబకు కుట్టుపని ఎంతో సరదా. క్రోషా అల్లికలో ఆమె ఎంతో నైపుణ్యము సంపాదించింది. క్రోషా అల్లికను గురించి "హిందూ సుందరి" అను పత్రికలో అనేక వ్యాసములు వ్రాసినది.

అచ్చమాంబకు చదువుకొను విద్యార్థులకు సహాయము చేయుట ఎంతో ఇష్టము. పేదలకు, విద్యార్థులకు ఆమె గృహ ద్వారములు ఎప్పుడూ తెరిచి ఉండెడివి. అందుకే ఆధునిక యుగములో భండారు అచ్చమాంబ ప్రఖ్యాతి గాంచిన ఆంధ్ర మహిళ అని పేరు బడసింది.

## రాణీ చిన్నమాంబ

రాణీ చిన్నమాంబ పిఠాపురం మహారాజు సూర్యారావు ధర్మపత్ని. పతివ్రత అయిన చిన్నమాంబ, సారస్వతాభిమానులు, సంస్కార ప్రియులు, ఉదార హృదయులు అయిన తన భర్తకు అన్ని విషయములలో చేదోడువాదోడుగా ఉండెడిది. ఆమె ఎంతోమంది అనాథలకు ఆశ్రయ మిచ్చినది. విద్యార్థులకు ప్రోత్సాహ మిచ్చినది. రాజులు తమ కొలువులో విద్వాంసులతో గోష్ఠి జరుపుట, అటువంటి సభలకు అప్పుడప్పుడు స్త్రీలు వచ్చి పాల్గొనుట మనకు తెలుసు. రాణి చిన్నమాంబ అట్లు కాక ఆనాడు పేరుపొందిన కవయిత్రులను సమావేశపరచి, తన ఆధ్వర్యమున విద్వద్గోష్ఠి జరిపేది. ఈమె ప్రోత్సాహము

వలన అనేకమంది స్త్రీలు విద్య నేర్చుకొనుటకు, విద్వత్ సమావేశములలో పాల్గొనుటకు వీలయింది. అటువంటి వారిలో కొటికలపూడి సీతమ్మ ఒకరు.

## కొ టి క ల పూ డి సీ త మ్మ

కొటికలపూడి సీతమ్మ తెనాలి తాలూకాలోని జెవుడుపాడు వాస్తవ్యులైన అబ్బూరు సుబ్బారావుగారి పుత్రిక. ఆమె భర్త కొటికలపూడి రామారావు. ఆయన పిఠాపురం సంస్థానములో ఉద్యోగము చేసెడివారు. భర్తతో తరచు పిఠాపురం వెళ్తూ రాణి చిన్నమాంబతో సన్నిహితంగా మెలగుట వలన ఆమెలో సాహిత్య తృష్ణ పైకి వచ్చిందని చెవుతారు. సీతమ్మ అసలు కందుకూరి వీరేశలింగం గారి ముఖ్య శిష్యురాండ్రలో ఒకర్తె. రాణీ చిన్నమాంబకు ఒక విధముగా ఆమె గురువుకూడా.

సీతమ్మ రామాయణమును వచనములో వ్రాసినది. ఒక పద్య గ్రంథమును కూడా వ్రాసినది. ఆమె సంఘ సంస్కర్త. 1913 లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ యొక్క మహిళా విభాగమునకు అధ్యక్షురాలుగా ఉండినది. ఎన్నెన్నో ఉపన్యాసము లిచ్చినది. ఈ ఉపన్యాసము లన్ని వితంతు వివాహము, స్త్రీ విద్యను ప్రోత్సహించి, సమర్థిస్తూ ఇచ్చినవే. ఈ ఉపన్యాసము లన్నిటిని కూర్చి, ఉపన్యాసమాలిక అను పేరుతో ఒక పుస్తకము అచ్చువేయబడినది. స్త్రీలకు విద్య అవసరమని తెలుపుటకు ఆమె రాణీ అహల్యాబాయి చరిత్ర వ్రాసినది. అందు ఇట్లు చెప్పినది :

స్త్రీలు విద్య నేర్వ జెడిపోదు రను మాట
కల్ల యనుచు దోప నెల్లరకును
విశదపరతు నొక్క విద్యావతి చరిత్ర
సంగ్రహముగ మీరు చదువుడయ్య.

ఈమె వ్రాసిన గ్రంథములు, వ్యాసములు సులభ శైలితో సామాన్యుల కర్థమయేటట్లు వ్రాయబడినవి. అత్త కోడలుపట్ల నడచుకొన వలసిన విధము, చక్కని ఉపమానలములతో ఆమె వివరించి, స్త్రీలలోని మూఢ నమ్మకములను పోగొట్టుటకు ఎంతో కృషి చేసినది.

## క ం దు కూ రు రా జ్య ల క్ష్మ మ్మ

కందుకూరు రాజ్యలక్ష్మమ్మ కందుకూరు వీరేశలింగం పంతులు గారి ధర్మపత్ని. ఆమె అన్ని విధముల ఆయనకు అనుకూలవతి యైన భార్యగా

జీవించింది. ఆయన చేసిన ఘనకార్యా లన్నిటిలో చేదోడు వాదోడుగా నిలచి, మహిళా లోకమునకే గొప్ప పేరు తెచ్చిన ఆంధ్ర మహిళ.

కందుకూరు రాజ్యలక్ష్మమ్మ 1851 వ సంవత్సరములో తూర్పు గోదావరి జిల్లాలోని కాతేరు గ్రామంలో జన్మించినారు. ఆమె చిన్నతనములోనే తల్లిని గోల్పోయి మేనమామ వద్ద పెరిగింది. ఆ కాలం సాంప్రదాయ మనుసరించి ఆమెకు 8 వ ఏట 12 సంవత్సరముల వయస్సు గల పంతులుగారితో వివాహ మయినది. ఆమెకు 12 ఏళ్ళ వయస్సు రాగానే కాపురానికి వచ్చి, బ్రతికినన్నాళ్ళు ఆయనకు సహ ధర్మచారిణిగా ఉండింది.

రాజ్యలక్ష్మమ్మగారు అష్ట కష్టము లనుభవించినారు. పంతులు పూర్వాచార పరాయణులు కారు. వారు స్త్రీ పునర్వివాహోద్యమము ప్రారంభించగానే సంఘము వారిని కులమునుండి బహిష్కరించింది. వారుగాని, వారి సతీమణి గాని ఎవ్వరింటికి వెళ్లటానికి వీలు లేదు. వారింటి కెవ్వరు వచ్చుటకు వీలులేదు. సాహసించి వారింటి కెవ్వరయినా వచ్చినా సంఘం వారినికూడా వెలి వేసేది. అందుకు ఎవ్వరూ వారింటికి వచ్చుటకు భయపడేవారు. పనివాండ్లుకూడా పని చేయుటకు వాళ్ళ యింటికి వెళ్లుట మానుకొన్నారు. పంతులుగారు ఈ విధమైన జీవితము నడుపుట రాజ్యలక్ష్మమ్మ పుట్టింటివారి కిష్టము లేదు. భర్తను విడిచి తమ వద్దకు ఆమెను వచ్చివేయమన్నారు. కాని ఆమె భర్తతో ఉండిపోయింది. కుల బహిష్కారం వల్ల ఆమె ఉదయం లేవగానే వాకిలి ఊడ్చుటనుండి, గిన్నెలు తోముట, వంట చేయుట, స్వయముగ మంచినీళ్లు తెచ్చుట, ఒకటేమిటి అన్నీ ఆమే చేయవలసి వచ్చింది.

పండుగలూ పబ్బాలూ వచ్చినా, యిరుగు పొరుగువారు వ్రతాలు చేసుకొన్నా, వారంతా చక్కగా నగలు పెట్టుకొని ముస్తాబై ఒకరింటి కొకరు వెళ్లినా రాజ్యలక్ష్మమ్మను పిలిచేవారు కాదు. పైగా ఆమెను సూటిపోటుమాటలతో హేళన చేసెడువారు. ఈ విధంగా జీవితాంతము ఆమె తనవారితో తిరగడానికి నోచుకోలేదు. అందుకని ఆమె విచారించక, ఎంతో కష్టపడి జీవితాన్ని గడిపింది.

రాజ్యలక్ష్మమ్మ అనేక మంచి పనులు చేసి తన జీవితమును సార్థకము చేసుకొన్నది. బాల వితంతువులు పలువురు పునర్వివాహము చేసుకోవలెనని ఇచ్ఛతో తన వద్దకు వచ్చెడివారి నందరిని ఆమె ఆదరించి, వారికి బొట్టు పెట్టి,

గాజులు తొడిగి, చీర రవికలు కట్టి, జడవేసి పువ్వులు పెట్టి, శృంగారించి, అవకాశము రాగానే వారికి పెండ్లిండ్లు చేసి, సంఘమునకు ఎంతో సేవ చేసి ఆ సేవలోనే ఎంతో ఆనందము పొందెడిది.

ఒకసారి గోగులపాటి శ్రీరాములను వానికి నాలుగు నెలల పసికందు ఉండగా భార్య చనిపోగానే, పంతులుగారు అతనికి ఒక వితంతువు నిచ్చి వివాహము చేసినారు. అప్పుడు రాజ్యలక్ష్మమ్మ ఆ చిన్న పిల్లవానికి తానే తల్లియై పెంచి, పెదచేసి, విద్య నేర్పించి, పటభద్రుని చేసింది.

రాజ్యలక్ష్మమ్మగారు పతితలైన స్త్రీలకు ఆశ్రయ మిచ్చి వారికెంతో సహాయము చేసెడిది. బాల్యములోనే వితంతువులయిన స్త్రీలు, రహస్యముగ ఒక్కొక్కప్పుడు పురుషులతో సంబంధము పెట్టుకొనెడివారు. తత్ఫలితముగ వారు గర్భము కూడా దాల్చెడువారు. ఒక్కోసారి, అమాయకులైన వితంతువులు ఒంటరిగా ఉన్నప్పుడు పురుషులు బలవంతముగా వారిపై అత్యాచారము జరిపెడివారు. అరటి ఆకుమీద ముల్లులాగా, తప్పు ఎవరిదయినా పాపము అనుభవింప వలసినది స్త్రీయే. అటువంటి స్త్రీలను పతిత లని పిలిచెడివారు. పతితలకు వారి గృహములలో నీడ లేదు. వారిని ఇంటినుండి వెళ్లగొట్టేవారు. అటువంటి స్త్రీలకు రక్షణ కల్పించుటకు రాజ్యలక్ష్మమ్మగారు, పంతులుగారు అనేక శరణాలయములను కట్టించినారు. కొన్ని సందర్భములలో తల్లులు బిడ్డలను కని, అనాథ శరణాలయ వాకిట్లో పెట్టి పారిపోయేవారు. వారిని పెంచి, పెద్దవారిని చేసేవారు రాజ్యలక్ష్మమ్మగారు అనాథ శరణాలయాలలో.

రాజ్యలక్ష్మమ్మగారికి కుల భేదముల పట్టింపులు లేవు. మానవులందరు సమానులే. ఈ భేదములు దేవుడు కల్పించినది కాదని ఆమె సిద్ధాంతము. శరణు జొచ్చినవాడు ఏ కులము వాడయినా ఆమె ఎంతో దయతో చూచెడిది. ఆ రోజులలో పంచము లనబడెడి హరిజనులు ఊరి వెలుపల నివసించెడివారు. ఈ రోజులలో గూడా ఊళ్ళలో హరిజనవాడలు ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. హరిజనులను మిగతా వారితో కలియనిచ్చేవారు కాదు. కులస్థులు వాడుతున్నటువంటి బావులలోని నీరు, వారు ముట్టగూడదు. ప్రాణము పోతున్నా వారికి నీరు చేకూర్చగూడదు. వారికి సహాయము చేసినట్లు తెలిసిన, ఆ సహాయము చేసిన వారిని సంఘము వెలివేసేది.

నిండా మునిగినవానికి చలేమిటన్నట్లు, రాజ్యలక్ష్మమ్మ గారిని సంఘం ఎటూ వెలివేసింది కాబట్టి, ఆమె నిర్భయముగా హరిజనులకు సహాయము చేసెడిది. ఒకసారి ఒక హరిజనుడు ఆకలిదప్పులకు ఓర్వలేక శోషపడి క్రింద పడిపోగా, రాజ్యలక్ష్మమ్మ గారు, అతనిని నెమ్మదిగా లేవనెత్తి నడిపించుకొని, తన ఇంటికి తీసుకొనిపోయి మంచినీళ్లిచ్చి అన్నము తన స్వహస్తముతో తినిపించింది. ఇంత ధైర్యము, దయ, ఆరోజులలో ఏ మహిళకూ ఉండి ఉండదు. ఒక్కొకసారి ఈమె సంఘ సేవయే పంతులుగారి సేవకన్నా గొప్పదని నా కనిపిస్తూ ఉంటుంది.

రాజ్యలక్ష్మమ్మగారికి దైవభక్తి ఎక్కువ. మానవసేవయే మాధవసేవ యని నమ్మినా, భగవంతుని కూడా పూజ చేయవలెనని ఆమె దీక్ష. ఆమె రోజు ఎంతోకాలము పూజలో గడిపెడిది. ఆమె రాజమండ్రిలో స్త్రీలను సమావేశ పరచి ప్రార్థనలు జరిపించెడిది. పంతులుగారు ఆమె కోరిక ననుసరించి, ఒక ప్రార్థన మందిరము కూడా కట్టించినారు. ఆంధ్రదేశములో స్త్రీల కొరకు ప్రత్యేకముగా ప్రార్థన సమాజము కట్టడం ఇది ప్రథమం. ఆటు తరవాత ఇటువంటి ప్రార్థన సమాజము లనేకములు కట్టబడినవి.

రాజ్యలక్ష్మమ్మగారు పెద్ద కవయిత్రి కాకపోయినా, కీర్తనలు కట్టి పాడినట్లు తెలియుచున్నది. ఈమె ఏకేశ్వరోపాసకురాలు. ఆయన మీద అనేక భక్తి కీర్తనలు వ్రాసినారు. పంతులుగారు రకరకములైన కవిత్వము వ్రాసినా, కీర్తనలు వ్రాయలేదు. ఆలోపమును ఈమె భర్తీచేసినది. ఈమె చివరి రోజువరకు పని చేయుచునేఉండిరి. పంతులుగారికన్నా ముందు చనిపోవాలన్న కోర్కె ఒక్కటే ఆమె తనజీవితములో కోరుకొన్నది. అట్లే సుమంగళిగా తనువు చాలించినది. ఆమెమరణించిన తరవాత పంతులుగారు తొమ్మిది సంవత్సరములు జీవించినారు. కాని ఆ తొమ్మిది సంవత్సరములలో వారు ఏమిపనులు చేసినట్లు కనిపించుటలేదు. మొత్తము మీద రాజ్యలక్ష్మమ్మగారు ఆంధ్రదేశ చరిత్రలో ఆదర్శ మహిళ అను పేరు పొందినారు.

## స్వాతంత్ర్యోద్యమము - ఆంధ్రస్త్రీలు

మొదటి ప్రపంచ సంగ్రామము ముగిసింది. భారతీయులు బ్రిటిష్‌వారికి యుద్ధములో సహాయము చేసిన వారు కోరిన స్వతంత్రము నిచ్చెదమని, యుద్ధ

కాలములో తమ ఉద్యమము మానమని వారు భారతీయులను కోరినారు. నమ్మకద్రోహులు బ్రిటిష్‌వారని భావించక, ఆడనిమాట తప్పరని ఎంచి, అనేకమంది భారతీయులు విదేశములకు వెళ్లి, బ్రిటిష్‌వారి పక్షమున అతి నేర్పుతో పోట్లాడి, వారి విజయమునకు ఎంతయో సహాయపడినారు. కాని బ్రిటిష్‌వారు తమ మాట నిలబెట్టుకోలేదు. 1919 శాసనము ఒక దానిని తయారుచేసి, ఒకేసారి కాకుండా కొంచెము కొంచెముగా వారికి హక్కు లిచ్చే ఓట్లుగా, ఈ కొత్త శాసనములో భారతీయులు స్వపరిపాలన చేసుకొనుటకు అనువుగా షరతులు కూర్చినారు. కాని అది భారతీయులకు కంటితుడుపే కాని, వారి కా శాసనమువల్ల ఎటువంటి లాభము కలుగలేదు. అంత మహాత్మాగాంధి రంగములోనికి దుమికినాడు. ఆయన ప్రారంభించిన నూతన ఉద్యమానికి సత్యాగ్రహోద్యమమని పేరు. ఈ ఉద్యమములో స్త్రీ పురుషు లందరు చేర వచ్చును. ఇది అహింసోద్యమము. ఈ ఉద్యమములో పాల్గొన్నవారు గొప్ప, పేద అను భావము మరచిపోవలెను. అంటరానివారు, అగ్ర కులమువారు అను భేదము చూపకూడదు. పట్టణాలవారే కాక పల్లెటూళ్ళలోవారు కూడా చేర వచ్చు. విద్య నేర్చినవారు, నేర్వనివారు కూడా ముఖ్య పాత్ర వహించవచ్చు. ఈ విధంగా అన్ని వర్గాలవారిని అన్ని కులాలవారిని స్త్రీ పురుషులను అంతే కాక అన్ని మతాలవారిని గాంధీమహాత్ముడు తన ఉద్యమములో చేర్చుకొని నాడు. అందుకే ఈ ఉద్యమము విజయము పొందినది. ఈ ఉద్యమము విజయవంతము కావడానికి ముఖ్యముగా స్త్రీలు కారణము. అసలు స్త్రీ ముఖ్య పాత్ర వహించనిది ఈ ఉద్యమము ముందుకు సాగదనీ, మహాత్మాగాంధిగారు సత్యాగ్రహము తమ సాధనముగా పెట్టుకొన్నారు. ఇందులో యుద్ధమునకు, కత్తులకు తావు లేదు.

అప్పటికే ఆంధ్రదేశములో వీరేశలింగం పంతులుగారు, ఆయన శిష్య పరంపర సహపంక్తి భోజనము, వితంతు వివాహములు, స్త్రీ అభ్యుదయము నకు కావలసిన విద్య, వరకట్న, కన్యాశుల్క నిర్మూలనము మొదలగు సంఘ సంస్కరణలవల్ల, స్త్రీలలో చైతన్యము కలిపించినారు. గాంధీగారి పిలుపు వారికి ఒక సవాలైనది. వారిలో ఇదివరకు లోని ఆత్మ విశ్వాసము ఉద్భవిం చింది. నిరాశ మచ్చుకు కూడా లేదు. వారు ఎంత దీక్షగా ఈ ఉద్యమములో పని చేసినారంటే ధైర్యముగా, ఎంతటి లాఠీ దెబ్బలకైనా చలించకుండా

ఓర్పుతో, మనో దార్ఢ్యముతో బ్రిటిష్‌వారిని ఎదిరించినారు. పురుషులతో బాటు వేదికల మీద నిలబడి అనర్గళంగా గంభీరోపన్యాసములు చేసినారు. ఇళ్ళనుండి బయటకు వచ్చి అష్టకష్టములకోర్చినారు. సుఖంగా ఇండ్లలో పట్టు పరుపుల మీద, మంచాల మీద నిదురపోయే స్త్రీలు జైళ్ళలో కటిక నేల మీద పరుండవలసి వచ్చినది. గంజినీళ్ళు మాత్రము త్రాగి బ్రతికిన రోజు లున్నవి. కాయకష్టమన ఏమో తెలియనివారు జైళ్ళలో శేర్లకు శేరు గంటల తరబడి బియ్యం, వడ్లు దంచవలసి వచ్చిన, నక్కుబాయి వలె కిక్కురుమన కుండా దంచినారు. ఈ విధముగా నానా కష్టములకోర్చి, భర్తలు, పిల్లలు పిరికి వారైనా, వారికి ధైర్యము చెప్పి, స్త్రీలు రంగములోనికి ఉరికి భారతదేశమునకు స్వాతంత్ర్యము సంపాదించినారు. ఆంధ్రదేశములో లెక్కలేని వనితామణులు ఈ విధముగా స్వాతంత్ర్యోద్యమములో పాల్గొన్నారు. వారందరి గురించి చెప్పుకపోయినట్లయిన సంవత్సరాలు చాలవు. అందులో కొందరిని గురించి తప్పక చెప్పవలసి ఉంది. వారిని గురించి ఇచ్చట చెప్పెదను. కాని మిగతా వారు వారిని తీసిపోయినారని కాదు. మచ్చుకు ఆంధ్ర వనితలు జాతియొక్క పౌరుషమును ఆత్మ గౌరవమును ఏ విధముగా కాపాడినారో చక్కగ గ్రాహ్య మగుటకు అయిదార్గురు వనితామణులను గురించి ప్రస్తావించెదను.

## దువ్వూరి సుబ్బమ్మ

మొట్ట మొదట, 1920 లో గాంధీగారి పిలుపు రాగానే స్వాతంత్ర్య సమరములో కురికిన ప్రథమ ఆంధ్ర స్త్రీ దువ్వూరి సుబ్బమ్మ. ఈమె సనాతన కుటుంబములో జన్మించినది. ఆమె తండ్రి శ్రీ మల్లాది సుబ్బావధానులు. భర్త దువ్వూరి వెంకయ్యగారు. భర్త మరణానంతరము ఆ రోజుల ఆచారమును బట్టి ఆమెకు కేశములు తీసివేసి తలకు ముసుగు కప్పినారు. కాని, సుబ్బమ్మ తనయొక్క వేషమును గురించి సిగ్గు పడలేదు. ఆమెకు బాహ్య అలంకార ములపై ఆసక్తి చూపలేదు. వేదాంతురాలు. ఆధ్యాత్మికచింతగల వనిత. చక్కగా అన్ని గ్రంథములు చదువుకొన్నది. ఇటువంటి స్త్రీ రంగములోనికి ఉరకడం ఎంతో ఆశ్చర్యము. ఆమె ఎన్నో లాఠీ దెబ్బల కోర్చింది. జైలుకు పలుమార్లు వెళ్ళినది. ఆమె వేదికమీద నిలబడి మాట్లాడినపుడు ఆమెను, ఆమె వేషమును చూచి నవ్వినవాడు ఒక్కడు కనిపించడు. ఆమె అనర్గళంగా మాట్లాడుతూ ఉంటే, ముగ్ధులై వినేవారు. ఆమె కంఠము ఎంత పెద్దదనగా

ఈ రోజులలో వలె లౌడ్‌స్పీకర్లు లేని కాలములో, 5, 6 వేల మంది జనము హాజరయిన మహాసభలో అందరికీ వినిపించేటట్లు అందరికి నచ్చచెప్పే విధంలో మాట్లాడి, వారిని తన వైపునకు, తన ఉద్యమము వైపునకు మళ్ళించుకొన్నది. ప్రభుత్వమువారు స్వాతంత్ర వీరులను పట్టుకొనడానికి వచ్చినప్పుడు వారిని రహస్యముగా వంట ఇంటిలో పొగగూళ్లలో చాక చక్యముగా దాచేవారు. పైగా కాంగ్రెసు రహస్య దళములో చేరి, ఎప్పటికప్పుడు బ్రిటిష్‌వారి చర్యలను నాయకులకు తెలియ చెప్పేది. ఆమె అఖిలభారత కాంగ్రెసు సంఘములో పదు నాలుగు సంవత్సరములు సభ్యురాలుగా ఉండి, ఆంధ్రలోనేకాక భారతదేశ ములో గొప్ప వనితగా పేరు పొందినది. ఆమె సనాతన విద్యాలయమును స్థాపించినది. అందు బిడ్డలకు ఉచిత భోజన వసతులు కూడా కల్పించినది. ఈ విధముగా దువ్వూరి సుబ్బమ్మగారు ఆంధ్రదేశమునకే కాక, భారతదేశ మునకు చేసిన సేవ అమోఘము.

## మాగంటి అన్నపూర్ణమ్మ

మాగంటి అన్నపూర్ణమ్మగారు ఏలూరు వాస్తవ్యులు. తండ్రి కలగర రామస్వామి. తల్లి పిచ్చమ్మ, భర్త మాగంటిబాపినీడు. వీరందరు స్వాతంత్ర్య సమరములో దీక్షతో పాల్గొనినవారే. పిచ్చమ్మగారు ఏలూరులో ప్రార్థన సమాజము స్థాపించి అనేక సంవత్సరాలు దానిని నడిపినారు. ఈ సమాజము తరపున ఒక బాలికా పాఠశాలను అన్నపూర్ణమ్మ పేరున, మాగంటి అన్న పూర్ణాదేవి జాతీయపాఠశాల అనుపేరుతో స్థాపించినారు. హరిజనోద్యమములో పాల్గొన్నారు. సత్యాగ్రహ సమరములో జైలు పాలైనారు. ఈ విధముగా ఎంతో దేశసేవ చేసిన పిచ్చమ్మగారి పుత్రిక మాగంటి అన్నపూర్ణమ్మ.

అన్నపూర్ణమ్మ తల్లికి ఏ మాత్రము తీసిపోలేదు. ఆమె ఈ ఉద్యమ మునకు తన సర్వస్వము, తన ప్రాణము కూడా ఇచ్చి అమరజీవి అని అని పించుకొన్నది. ఆంధ్రదేశములో విద్యావంతులైన స్త్రీలు ఆ రోజుల్లో బహు కొద్దిమంది. వారిలో అన్నపూర్ణమ్మ ఒకరు. ఆమె కలకత్తాలో విద్య నభ్య సించెను. మాతృభాషయైన తెలుగుతోపాటు చక్కగా ఆంగ్లభాషలో కూడ మాట్లాడగలిగేది. ఆమె ఉన్నతవిద్య కొరకు 1920 లో అమెరికాకు ప్రయాణ మయినారు. దానికి కావలసిన విలువైన దుస్తులు కూడా తయారు చేసుకొని పాస్‌పోర్టు కూడా తెచ్చుకొన్నారు. గాంధీగారి పిలుపు వినగానే తన ప్రయాణ

మును మానుకొని, విలువైన తన విదేశీ దుస్తులను దహనముచేసి, తన ఒంటి మీది నగలన్నీ, గాంధీజీగారికి ఉద్యమము కొరకు సమర్పించింది. ఈమె గాంధీగారి ప్రియ శిష్యురాలు. గాంధీగారు ఆమె మరణించినప్పుడు ఆమెను గురించి ఈ విధముగా చెప్పినారు: "ఈమె ఒక విశ్వాసముగల భక్తురాలు. ఈమె దృఢవిశ్వాసముతో పొగడ్తనుగాని, బహుకరణముగాని అభిలషింపకయే కృషి సల్పును. తన పవిత్రతవలనను, పాతివ్రత్యమువలనను తన భర్తపై ఎట్లు మృదువయిన అధికారము సంపాదింపగలిగినదో అట్లే గృహిణు లందరు తమ భర్తలపై నట్టి అధికారమును సంపాదించవలెనని కోరుచున్నాను. మాతృదేశముకొరకు ఆమె తన ఆరోగ్యమునుకూడా లెక్కచేయకుండా, క్షీణించి, ప్రాణత్యాగముచేసినది. నాకుగల అనేక పుత్రికలలో, అత్యుత్తము రాలైన ఒక పుత్రిక పోయిన"దని గాంధీగారు వాపోయినారు.

అన్నపూర్ణమ్మ ఖద్దరు వస్త్రములనే ధరించింది. అందరివద్ద విరాళములు ద్రవ్యమును ప్రోగుచేసి గాంధీగారికిచ్చెడిది. ఖద్దరు వ్యాప్తికి, కల్లు సారాయి మాన్పడానికి ఎంతో ప్రచారముచేసినది. ఈమె భర్త అమెరికాలో ఉన్నప్పుడు "నన్ను మరచినను, దేశమును మరువవలదు. నేను స్థిరముకాను" అని వ్రాసినది. ఈ విధముగా అన్నపూర్ణమ్మ దేశసేవకురాలై ఆంధ్ర స్వాతంత్ర్యోద్యమచరిత్రలో ముఖ్యస్థానము పొందినది.

## మానాప్రగడ రామసుందరమ్మ

రామసుందరమ్మ సీతానగరవాసి. ఈమె భర్త ప్రగడ వెంకటకృష్ణారావు. ఈమె ఉద్యమములో చేరునప్పటికి ఈమె వయస్సు 12 సంవత్సరములుకూడా పూర్తిగాలేదు. వయస్సుతో నిమిత్తములేని ఉద్యమము. చిన్న, పెద్దలు వారి వారి శక్త్యానుసారము పాల్గొని నటువంటి ఉద్యమమని చెప్పుటకు రామసుందరమ్మయే నిదర్శనము. ఈమె 1926 లో అనగా తన 12 ఏట కాంగ్రెసులో చేరినది. నిర్మాణ కార్యక్రమములో పాల్గొనినది. ఈమె 1933లో గుంటూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర స్త్రీనియంతల మహాసభకు నైజాం రాష్ట్ర ప్రతినిధిగా హాజరయి పాల్గొనినది. అదే బ్రిటిషు ప్రభుత్వమునకు విరుద్ధమైన చర్య. అందుకని ఆమెకు 15 మాసములు కారాగారశిక్ష, 2000 రూపాయల జరిమానా విధించినారు. ఆ జైలు జీవితమువల్ల ఆమె జబ్బుపడి, జైలునుండి

విడుదల అయినా రోగము ఆమెను విడువలేదు. ఒక సంవత్సరకాలము రోగ పీడితయై 18 సంవత్సరములుకూడా పూర్తికాకమునుపే 1934 లో మరణించి నది. ఇంత చిన్నవయస్సులో దేశసేవలో ప్రాణత్యాగమొనర్చిన పవిత్రజీవి రామసుందరమ్మ.

## చుండూరి రత్నమ్మ

చుండూరి రత్నమ్మ గొప్ప జమిందారిణి. ఏలూరు వాస్తవ్యులు. తండ్రి పైడా వెంకటచలపతి. భర్త చుండూరి శ్రీరాములు. ఈమె వైశ్యకుటుంబ ములో జన్మించినది. ఆ రోజులలో వైశ్యస్త్రీలు పైకి వచ్చి, బహిరంగముగా ఏ సభలోను పాల్గొనెడివారుకారు. అయినను చుండూరి రత్నమ్మ అటువంటి నియమములను ఖాతరుచెయ్యలేదు. ఈమె ఏలూరు కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గసభ్యురాలుగా ఎన్నోసంవత్సరములు పనిచేసినది. స్వాతంత్ర్యోద్యమ ములో పాల్గొని 1932 లో, 1940 లో జైలుశిక్ష అనుభవించినారు. ఆ రోజు లలో జైలుశిక్ష అంటే నరకము. వందలమందికి వంటలుచెయ్యడం, పుట్లు పుట్లుగా వడ్లు దంచడము, బరువులు మోయడము, మొదలైన పనులు అందరు ఖైదీ స్త్రీలు చేయవలసినదే. ఈమె ఖద్దరు, మద్యపాననిషేధము, హరిజనాభ్యు దయము, మహిళాభ్యుదయము మొదలగు అనేక ఉద్యమములను కూడా ప్రోత్సహించి సేవచేసినారు.

చుండూరి రత్నమ్మగారు అనేక మహిళామహాసభలకు అధ్యక్షత వహించినారు. 1937 లో కాంగ్రెసుపక్షమున ఏలూరు పురపాలకసంఘ సభ్యు రాలుగా ఎన్నుకొనబడింది. 1940 లో పురపాలకసంఘమునకు ఏకగ్రీవముగా అధ్యక్షురాలిగా ఎన్నుకొనబడినది. ఆంధ్రదేశములో ఈ పదవికి స్త్రీ ఎన్ను కొనబడుట ఇదియే ప్రథమము. అందుకే ఈమెను అనేక పురపాలకసంఘ ములు సన్మానించి గౌరవించినవి. ఈమె అనేకమంది కాంగ్రెసు మెంబర్లను చేర్చినందుకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు ఈమెకు వెండి షీల్డును బహుకరించి నారు. ఈమె అనేక సంస్కృత ఆంధ్రగాన నృత్యకళాశాలలను ప్రోత్సహించి అందు చదువుచున్న బాలబాలికలలో పోటీలలో నెగ్గినవారికి రజత, స్వర్ణపతక

ములను బహూకరించెను. నెల్లూరు వైశ్యమహాజనసభ ఈమెకు సంఘ సేవా
పరాయణి అను బిరుదును ఇచ్చినది.

## ఉన్నవ లక్ష్మిబాయమ్మ

ఉన్నవ లక్ష్మిబాయమ్మ జాతీయోద్యమములో మహిళలకు నాయ
కత్వము వహించి వీరోచితముగా పోరాడిన ఆంధ్రమహిళ. ఈమె గుంటూరు
జిల్లాలోని సత్తెనపల్లి తాలూకా, అమీనాబాదగ్రామంలో జన్మించినారు. ఈమె
తండ్రి నడింపల్లి సీతారామయ్య, తల్లి లక్ష్మిదేవమ్మ. భర్త భారతజాతీయోద్య
మము, ఆంధ్రరాష్ట్రోద్యమము, సంఘ సంస్కరణోద్యమములను సామర్థ్యములో
నిర్వహించిన అగ్రశ్రేణి ఆంధ్రనాయకుడైన ఉన్నవ లక్ష్మినారాయణగారు.
లక్ష్మిబాయమ్మకు, ఆకాలపు పరిస్థితులనుబట్టి పదవఏటనే వివాహమయ్యెను.

లక్ష్మిబాయమ్మగారు భర్త అడుగుజాడలలో మెలగుచు, ఆయనకు శిష్య
రికముచేసి భారత భాగవతాది గ్రంథములను చదివి అర్థముచేసుకొను
జ్ఞానము సంపాదించినది. భార్యాభర్తలిరువురు వీరేశలింగంపంతులుగారు
పాటుబడిన సంఘసంస్కరణకు పాటుపడిరి. వారి పిలుపును పురస్కరించు
కొని, కొంతకాలము వారు స్థాపించిన రాజమహేంద్రవరములోని అనాథ శర
ణాలయమును నడుపుచుండిరి. 1908 లో వారు గుంటూరులోనే అంతకు
పూర్వమే వారు నెలకొల్పిన వితంతు శరణాలయమును నిర్వహించుటకు ప్రారం
భించిరి. ఈ శరణాలయములో అనేక వితంతువులకు ఆశ్రయము కల్పించి,
వారికి వివాహములుకూడా చేసినారు. వారికి బ్రహ్మసమాజముపట్ల ఆసక్తి
ఉన్నను, అందులోచేరక సనాతన ధర్మము పాటించుచు, అందులో ఉండి
ఎంతవరకు సంఘసంస్కరణచేయుటకు వీలగునో అంతవరకు సంస్కరణ
చేసిరి.

లక్ష్మిబాయమ్మగారు 1922 లో గుంటూరులోనే బాలికలకు ప్రత్యేక
ముగా ఒక పాఠశాలను స్థాపించినారు. దానికే శారదా నికేతనమని పేరు.
అది ఈనాటికి ఎంతో చక్కగా పనిచేయుచున్నది. ఈ పాఠశాల జాతీయ
విద్యను వృద్ధిచేయుటకు ఏర్పడింది. ఇందులో సంస్కృతాంధ్రములు, సంగీ
తము, చిత్రలేఖనము, కుట్టు, అల్లిక మొదలైన వృత్తివిద్యలు నేర్పుటకు
ఏర్పాటులుచేసినారు. వీరు బాలికల అభివృద్ధికి, వితంతు పునరుద్ధరణకు జీవి

తాంతము పాటుపడినారు. వీరు స్థాపించిన పాఠశాలలో చదివి ఎంతోమంది ఉన్నతపదవు లందినవారున్నారు.

లక్ష్మీబాయమ్మగారు జాతీయోద్యమములో ఎంతో ప్రధాన పాత్ర వహించినారు భర్త ఈ ఉద్యమంలోచేరి జైలుపాలుకాగా, భర్తస్థానమును ఆమె ఆక్రమించి, ఆంధ్రదేశమంతటను సంచారముచేసి, విద్యార్థులకు, స్త్రీలకు ముఖ్యముగా ఉపన్యాసములిచ్చి, సత్యాగ్రహోద్యమము ఆంధ్రలో ఎంతో వ్యాప్తికావడానికి వినుటకు లక్షలాది జనులు వచ్చేవారట. ఈమె ఉద్యమము నడిపినప్పుడు మూడు పర్యాయములు జైలుకుకూడ వెళ్లినది.

ఈ విధముగా ఆమె బొందిలో ప్రాణమున్నంతవరకు జాతీయోద్యమమునకు, ఖద్దరు ప్రచారమునకు, అస్పృశ్యతానిర్మూలనమునకు, మహిళాజనోద్ధరణకు కృషిచేసి, ఆంధ్రదేశచరిత్రకు వన్నెతెచ్చిన మహిళ.

## ఆచంట రుక్మిణమ్మ

ఆచంట రుక్మిణమ్మ భారతదేశ స్వాతంత్ర్యచరిత్రలోనే ముఖ్యమైన పాత్ర వహించిన మహిళ. ఆమె తండ్రి మధురవాస్తవ్యులు ఉగ్గెళ్ల శ్రీనివాసరావు, తల్లి చూడమ్మ. ఈమెకు చిన్నతనముననే వివాహముచేయవలెనని ప్రయత్నములుచేసినను, తగిన వరుడు దొరకక తండ్రి ఆమెను పైచదువులు చెప్పించటానికి నిశ్చయించుకొన్నాడు. మద్రాసులో ప్రెసిడెన్సీ ట్రేనింగ్ స్కూలులో చేర్పించినాడు. ఆమె తన 18వ ఏట మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణురాలయినది. కాని అప్పటికే ఆమె డాక్టరు ఆచంట లక్ష్మీపతిని ప్రేమించి 1911 లో వివాహము చేసుకొన్నారు. ఈ వివాహమునకు ఊరిలో పెద్ద లనేకులు విచ్చేసి వధూవరులను ఆశీర్వదించినారు. ఆమె స్వయంకృషితో 1920లో బి. ఏ. పరీక్షకూడా ప్యాసయినారు. ఈ విధముగా ఆ రోజులలో పట్టభద్రలయిన కొద్దిమంది స్త్రీలలో ఆచంట రుక్మిణమ్మ ఒకరై.

ఈమె వివాహమయి మద్రాసులో స్థిరమయినప్పటినుండికూడా మహిళాభ్యుదయమునకు ఎంతో పాటుపడినది. అఖిల భారత మహిళాసభ మద్రాసుశాఖకు ఆమె కార్యదర్శిగా పనిచేసినారు. అచ్చట స్వదేశీ స్టోర్సు అను ఒక దుకాణమునుకూడా స్థాపించి దానిని మహిళలు నడుపునట్లు ఏర్పాటుచేసినది. ఈమె కార్యక్రమాలలో ఖద్దరు ప్రచారము విదేశీ వస్త్రబహిష్కరణకూడా ఉన్నవి.

ఈమెయొక్క ప్రతిభ ఎంతవరకు వెళ్లిందనగా 1926 లో పారిస్‌లో జరిగిన 'ఇంటర్‌నేషనల్ విమెన్స్ సఫ్‌రేజ్ అలైన్స్ కాంగ్రెసు'కు ఈమె భారతదేశపు ప్రతినిధిగా ఆ సమావేశములో పాల్గొనినది. విదేశమునుండి వచ్చిన తరవాత ఆమెయొక్క స్థానము దేశములో మరింత పెరిగెను చెంగల్పట్టు జిల్లాబోర్డు మెంబరుగాను, ఎగ్మూరు నియోజకవర్గము నుండి మద్రాసు కార్పొరేషన్ సభ్యురాలుగాను పని చేసినది.

ఇట్లుండగా 1930 లో గాంధీ మహాత్ముడు ఉప్పు సత్యాగ్రహమును ప్రారంభించినాడు. వేదారణ్యము వద్ద సత్యాగ్రహము చేసి, బ్రిటిష్‌వారి చేతిలో బంధితురాలయినది. ఈ విధముగా ఉప్పు సత్యాగ్రహమును చేసి, బంధితురాలైన ప్రథమ భారతీయ మహిళ ఆచంట రుక్మిణమ్మ. ఈమె అప్పుడు, తర్వాత క్విట్ ఇండియా ఉద్యమములో అనేకసార్లు జైలుకు వెళ్ళినారు. ఈ విధంగా స్వాతంత్రోద్యమంలో ముఖ్య పాత్ర వహించింది. ఈమె కొన్ని దినములు తమిళనాడు రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి అధ్యక్షురాలుగా కూడా పని చేసినది. మద్రాసు శాసనసభకు డిప్యూటీ స్పీకరుగా కూడా ఉండింది. అఖిల భారత మహిళా సభకు కార్యదర్శిగా, అధ్యక్షురాలుగా పని చేసినది. 1946 లో ప్రకాశం పంతులుగారు మంత్రివర్గము ఏర్పాటు చేసినప్పుడు ఆమెను ఆరోగ్య మంత్రిగా ఆయన నియమించినారు. ఈ విధంగా రుక్మిణమ్మ అన్ని రంగములలో మేటి అనిపించుకొని, ముఖ్యంగా మన స్వాతంత్రోద్యమంలో ముఖ్య పాత్ర వహించి, పేరు ప్రఖ్యాతులు పొందినది.

ఈమె కృషి ఫలితంగా గుంటూరులో వైద్య కళాశాల స్థాపించబడింది. మద్రాసులో దేశీయ వైద్య పాఠశాల (Indian Medical School) ను కళాశాలగా మార్పించి, దేశీయవైద్య అభివృద్ధికి ఎంతో పాటుపడింది. ఈమెకు దైవభక్తి ఎక్కువ. సంగీతము చక్కగా పాడగలదు. ఈ విధముగా సర్వతోముఖ ప్రజ్ఞ గల రుక్మిణమ్మ ఆంధ్ర మహిళాలోకంలో చిరస్మరణీయురాలు.

## పొణకా కనకమ్మ

పొణకా కనకమ్మ నెల్లూరు వాస్తవ్యురాలు. ఈమె తండ్రి మరుపూరు కొండారెడ్డి. భర్త సుబ్బరామరెడ్డి. ఈమె గూడా దేశభక్తురాలై, మన

స్వాతంత్ర్య సమరములో ముఖ్య పాత్ర వహించినది. సంఘ సంస్కారము చేసినది. స్త్రీ విద్యకై ఎక్కువ పాటుపడినది.

గాంధీగారి ఉప్పు సత్యాగ్రహ పిలుపు వినగనే దేశములో పురుషుల కన్నా స్త్రీలే ఎక్కువ ఉద్రేక పూరితులై ఈ ఉద్యమములో పాల్గొనినారు. అటువంటి మహిళలలో పొణకా కనకమ్మ ఒకరు. ఆమె ఒకర్తే కాక, ఆమె కుటుంబమంతా కూడా కాంగ్రెసు ఉద్యమములో పాల్గొని, దేశ హితకార్యమును సాగించినారు. ఈమె ఉప్పు సత్యాగ్రహ సందర్భములో రెండు పర్యాయములు కారాగార శిక్ష అనుభవించినారు. ఆమె వహించిన పాత్రను మెచ్చి, ఈమెకు కాంగ్రెసు కార్యవర్గ సంఘములో సభ్యత్వ మిచ్చినారు. ఈమె అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలుగాను, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యురాలుగాను, ఉపాధ్యక్షురాలుగాను పని చేసినారు.

పొణకా కనకమ్మ ఆంగ్లభాషలో మాట్లాడగలిగేవారు పైన చెప్పినట్లు కనకమ్మగారు రాజకీయరంగమునమాత్రమే పరిశ్రమించలేదు. ఆమె బాలికల కొరకు నెల్లూరులో ఒక పాఠశాలను స్థాపించింది. దానికి కస్తూరిబాగాంధీ పేరుతో కస్తూరిబా పాఠశాలయని నామకరణముచేసినారు. ఈనాడు ఆ పాఠశాల జూనియర్ కళాశాలగా మారినది.

కనకమ్మగారు సారస్వత క్షేత్రమునకూడా కృషి సలిపినారు. వీరు కొంతకాలము శ్రీ రమణమహర్షి యాశ్రమమున నివసించి శ్రీరమణ బ్రహ్మాంజలి యను తొమ్మిది సీసపద్యములు రచించి, తన యాధ్యాత్మిక చింతను విశదపరచినది. శ్రీరామయోగి, గురుదేవుడు అను రెండు జీవిత చరిత్రలను కూడ ప్రచురించినారు.

ఈమె ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మతో చేరి కవయిత్రీద్వయ మని పేరు తెచ్చుకొని, కవిత్వము వ్రాసినారు. కలిసి రాజకీయములలో పనిచేసినారు. ఈ విధముగా జంటగా ప్రచురించిన వాటిలో 'ఆరాధన' అను గ్రంథము చక్కని కావ్యము. వారు 'గీత'ను కూడా కొంచెమువరకు తెలుగులో అనువదించినారు. పురుషులనేకులు గీతను అనువాదము చేసినవారున్నారు. కాని స్త్రీలలో ఇట్లు 'స్తుతిపాత్రముగ, సుకరముగ, సుసంగ్రహముగ, సులలితముగ గీతానువాదముచేసినవారు కనిపించరు. అందుకని వారిదే ప్రథమ స్థాన'మని ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ గారు చెప్పినారు.

కనకమ్మ భర్తగారైన పొణకా సుబ్బరామరెడ్డిగారు అగర్భశ్రీమంతులు. వీరికుటుంబము వారు అనాదిగా దానధర్మములు చేసెడివారని పేరు, వీరికృషిఫలితముగానెల్లూరులో జమీన్ రైతు పత్రిక స్థాపింపబడినది ఇంతటి ధనవంతురాలయ్యు కనకమ్మ నిరాడంబరజీవి. తెల్లటి ఖద్దరు వస్త్రములనే ధరించెడిది. ఎటువంటి భూషణములు దాల్చక విశుద్ధమైన అంతరంగమే ఆమెకు భూషణముగా ప్రవర్తించినది. ఈ విధముగా వారన్ని విధముల ఆంధ్ర నారీలోకమునకు ఆదర్శ ప్రాయురాలుగ నిలబడిపోయినారు

మన ఆంధ్రదేశములో స్వాతంత్రోద్యమములో పాల్గొనిన మహిళల పేర్లు ఈవిధముగ చెప్పుకపోతూ ఉంటే దానికి ఒక హద్దు ఉండదు. వారందరూ ఎంతో త్యాగముచేసినవారు. వారిలో అనేకులు సంఘసంస్కరణ, రాజకీయములతోబాటు చక్కని కవిత్వముల్లి. గొప్ప కవయిత్రులని పేరు పొందినారు. వారిలో కొంతమంది శతక కవయిత్రులు, కొంతమంది యక్షగాన కవయిత్రులు. మరికొంతమంది నవలలు రచించినారు. ఇతరులు ఆధ్యాత్మిక సంబంధమైన రచనలుచేసినారు. వారందరిగురించి ప్రత్యేకముగ చెప్పుటకిచ్చుట తావులేనందున అశక్తురాలినైనాను. దీనినిబట్టి ఆంధ్రదేశములో మహిళలు ఎంత బాగా 20 వ శతాబ్దములో పురోగమించినారో తెలియగలదు.

స్వతంత్రము వచ్చిన తరవాత అన్ని రంగములలో ఆంధ్ర స్త్రీలు పురోగమించినారు. బాలురతోబాటు బాలికలు ఉన్నతవిద్య నభ్యసించుచున్నారు. ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణులగుచున్నారు. ప్రభుత్వము ఆ విధముగా ఉత్తీర్ణులయినవారికి వేతనములు, బహుమానము లిచ్చుచున్నది. వైద్య కళాశాలలో చాలావరకు జీతము కట్టక ఉచితముగా బాలికలకు విద్య నేర్పబడుచున్నది.

అనేకమంది స్త్రీలు ఉద్యోగములు కూడ చేయుచున్నారు. ఐ.ఏ.ఎస్. మొదలైన పోటీ పరీక్షలలో కూడా ఉత్తీర్ణులై ఉద్యోగములు చేయుచున్న ఆంధ్ర మహిళలు కనిపిస్తున్నారు. విశ్వవిద్యాలయాలలో, కళాశాలలలో, పాఠశాలలలో ఉపాధ్యాయులుగా, అనేకమంది పని చేయుచున్నారు. న్యాయవాది వృత్తిని చేపట్టినవారున్నారు. పురుషులు ఏ ఏ రంగములలో ఉద్యోగముల కర్హులో ఆ ఉద్యోగము లన్నిటికీ స్త్రీలు అర్హత సంపాదించచడమేకాక ఆ ఉద్యోగములను సంపాదించినారు. అనేకమంది ఆంధ్ర మహిళలు పై విద్యలకు

గాను, ఉద్యోగరీత్యా ప్రభుత్వము తరపున విదేశములకు పోయి గౌరవము పొందుతున్నారు.

ఆంధ్ర యువతీమణులు లలితకళలలో కూడా తీసిపోలేదు. సంగీతము, నృత్యము, నాటకము చిత్రకళ, మొదలయినవాటిల్లో ఎంతో కౌశలమునుచూపి అఖిలభారత స్థాయిలో పేరు పొందుతున్నారు. అట్లే చలనచిత్ర రంగములో కూడా దర్శకురాండ్రుగాను, నిర్మాతలుగాను కథా రచయిత్రులుగాను, నటనలో పేరు ప్రఖ్యాతులు పొందుతున్నారు.

మరొక విషయమేమనగా ఆంధ్ర మహిళలు తెనుగు భాషకు, తెనుగు నాడుకు మాత్రము సేవ చేయక, ఇతర భాషలకు ఇతర ప్రాంతములకు సైతము అపార సేవ చేయుచున్నారు. ముఖ్యముగా హిందీ భాషకు వారు ఎంతో కృషి చేసియున్నారు. ఈవిధముగా ఆంధ్రదేశ చరిత్రలో స్త్రీ ముఖ్య పాత్ర నాడు నేడు కూడ వహిస్తున్నది.

—oo—

# దేశభాషలందు తెలుగు లెస్స




ప్రపంచ తెలుగు మహాసభలు

1975, ఏప్రిల్ 12–18.

వారిలో చానమాంబ ప్రథమురాలు, ఆమె రణతిక్కన అమ్మ పేరు గాంచిన ఖడ్గ తిక్కనార్యుని కులపత్ని. కవిబ్రహ్మ తిక్కనకు వరుసకు వదినెగారు. ఆమె భర్త రణరంగమునుండి పారిపోయి తన గృహమునకురాగానే అతనిని దెప్పుచు. అతనిలో శౌర్యము రేకెత్తునట్లు వెంటనే ఆమె కంఠమునుండి ఈ విధముగా సరస్వతీదేవి పలికించింది.

పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడు వారమయితిమి
వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్.

చానమాంబ చక్కని కవితాత్మగల కాంతయని ఆ కందమే చాటి చెప్పు చున్నది. ఖడ్గ తిక్కన తల్లికూడా ఆమెకు తీసిపోలేదు. ఆమె తన కుమారుడు పిరికిపందగా రణరంగమునుండి పారిపోయివచ్చుట సహించలేదు. అతడు యుద్ధమున మరణించినా సంతసించెడిదిగాని, భీరువై ఈ విధముగా తలదాచు కొనుట ఆమెకు తలతీపివేసినట్లైనది. అతనిని తిరిగి రణరంగమునకు మళ్లిం చుటకుగాను తన కుమారునిగాంచి ఇట్లు చెప్పినది.

అసదృశముగ నరివీరుల
పసమీరగ గెలువలేక పంద క్రియన్నీ
వసివైచి తిరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క! పాలున్ విరిగెన్.

ఈ విధముగా ఆ కుటుంబములో అత్త కవయిత్రి. కోడలు కవయిత్రి. కవి బ్రహ్మ తిక్కన సోమయాజి ఈమె కుమారుడుకాడు. ఊటుకూరి లక్ష్మి కాంతమ్మగారు వారిని గురించి వ్రాయుచు "ఈ యాడువారి ప్రతాపాగ్నిచ్చటల ధాటి కోహటించలేకయేకదా, ఖడ్గ తిక్కన రణసీమకు మగుడవెడలి యద్భుతముగ నరివీరుల కసిమసంగి విజయలక్ష్మిని చేపట్టినాడు. స్వదేశమునకు, సమర విజయమును సముపార్జించిన యీ కవయిత్రుల తేజో లేఖిని యాంధ్రదేశమున నేటికిని నజరామరకీర్తులతో శోభిల్లుచున్నద"ని చెప్పినారు.